# మన తెలుగు

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# మనతెలుగు

భమిడిపాటి కామేశ్వరరావు




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయములు


| | | | |
|---|---|---|---|
| పరీక్షలు | ... | మే | 1931 |
| "మన" తెలుగు | ... | సెప్టెంబరు | 1938 |
| దశరూపకం | ... | డిసెంబరు | 1938 |
| శాస్త్రం - కళ | ... | మార్చి | 1939 |
| 'రెండో భాష' మేష్టరు | ... | ఆగష్టు | 1941 |
| గ్రంథప్రచురణ | ... | మే | 1944 |

# పరీక్షలు

[ఇది ౫-౮-౧౯౬౧ తేదీని ఏలూరు హైస్కూలులో, పాతవిద్యార్థి సంఘం తరఫున జరిగిన వార్షికసమావేశసందర్భంలో చదివినది.]

ఇది ఈ హైస్కూలు తాలూకు పాతవిద్యార్థిసంఘం యొక్క ద్వితీయవార్షికోత్సవ సమయం. ఈసందర్భంలో సరస్వతీపుత్రులైన సోదరులు చాలామందిఎఱుగుంటే ఒకర్ని ఒకరు కలుసుగోడానికీ, ఎఱక్కుంటే ఒకర్ని ఒకరు తెలుసుగోడానికీ, వీలైంది — లక్ష్మీపుత్రులైన సోదరులు భోజనం వగైరా ఖంజాయింపులు చెయ్యడంవల్ల. ఈసభలో బాలుగు వృద్ధులు, వృద్ధబాలురు, బాలవృద్ధులు, వగైరాలు, ఉన్నారు. వయోభ్యాసాల్నిబట్టీ, జ్ఞానైశ్వర్యాల్నిబట్టీ మానవులకి అభిరుచులు ఉంటాయి. అనేకమైన అభిరుచులు గలవారు పంక్తులుతీర్చి కూర్చున్నప్పుడు యావన్మందికీ సయించే ఏకవస్తువు తేవడం కష్టం, అందేటట్టు వడ్డించటం కష్టతరం. పోనీ ఏ ఎలకనో అడిగి తెచ్చి వడ్డించిన తరవాత తీరా బాగుంటుందామరి అని వారు భరించి భుజించినా అది అందరికీ రుచించడం కష్టతమం. అయినా సరే 'యథాశక్తి' సూత్రాన్ని అనుసరిస్తూండాలి. ఇక్కడ ఉన్నవారిలో, ప్రతివారూ ఏనోకొన్ని పరీక్షలు చవిచూసి ఉంటారు. అంచేత, మనకందరికీ, 'పరీక్షలు' అనేది సామాన్య విషయం అనచ్చు. కాబట్టి, "పరీక్షలు" గురించి కొంచెం అంటాను.

హాస్యరహస్యం తెలిసిన ఒకకవి రాసినదాల్లో ఒకచోట:

వెంకన్న — రాముడూ! పరిక్షంటేయేమిషిరా?

రాముడు — పరిక్ష అంటే యగ్జామినేషన్.

వెం _ (ప్రాణం పీలుస్తూ) యెజ్ఞం నాకు తెలుసును. మేషం అంటే మేక; మేకపోతుని వేస్తారా యేమిషిరా?

రా — ఫూలిష్! యెజ్ఞంకాదు, మేషంకాదు. శాస్త్రాల్లో ప్రశ్నలు అడుగుతారు.

అని ఉంది. ఇంగ్లీషుమాటనిబట్టి వెంకన్న తీసిన అర్థంవల్ల కొంత నవ్వు వచ్చినా, కొంత సత్యంకూడా తేలుతుంది. అలాగానే అసలుపదం అయిన పరీక్ష అంటే ఏమిటో చూడాలి. పరీక్ష అంటే చూడడమే, ఇటూ అటూ అంతటా నిదానించి చూడడం. సంభాషణల్లో "ఏం? ఆయన్ని మీరు అంత పరీక్షగా చూస్తున్నారు, ఎరుగుదురా!" అనీ, ఎక్కడేనా లోతభిసీళ్ల వయినం తేల్చవలి సొచ్చినప్పుడు, "ఏమో! అంత పరీక్షగా అడిగితే నేను చెప్పలేనుస్మీ దాం తగలెయ్యా!" అనీ అంటూంటారు. కొన్నికొన్ని మాటలకి అర్థాలు మారుతూంటాయి. క్రమేణా ఈమాటయొక్క అర్థంకూడా చెదిరింది. అక్కణ్ణించి, మనస్సులో ఉండే సంగతులు చూడ్డానికి చేసే ప్రయత్నం అనే అర్థంతో ఈమాట వాడుతోచ్చారు. మనస్సు కంటికికనిపించదు. అల్లాంటిమనస్సులో ఏమున్నా అంశం గాని, వృత్తాంతం గాని ఉంటే (సాధారణంగాఉండకపోవచ్చులెండి!) అవి అంతకంటే కనపడవు. అవి ఏరూపంగానో బహిర్గతంఅయినప్పుడే వాటికి జన్మ సిద్ధి. అందుకు సాధనం ప్రశ్న. అవి గాలంలాగ పనిచేసి కల్మషం

లేని మనస్సుని బట్టబయలు చేస్తుంది. తను చెప్పింది కట్టుదిట్టంగా కుర్రాడిమనస్సుని పట్టుకుని ఉందో లేదో కనిపెట్టడానికి, చెప్పేవాడు, చిన్నచిన్న ప్రశ్నలువేసి వాటి సమాధానాలు చూసుగుని మరీ చెబుతాడు కొత్తసంగతి. అనగా పరీక్షిస్తూండడం చెప్పేవాడికి నిత్యకర్మ. అందుకనే, చదువుచెప్పే బంధువుడు ఎవరేనా గుమ్మంలోకి వస్తే, ముసలమ్మగారు, "చూడు నాయ్నా! మాకుర్రకుంక పోతుభారం చెప్పాగుంటున్నాడు. ఏకఅల్లరి. కాస్తపరిక్షచేసి వెడుదూ!" అని కోరుతుంది. ఆప్రకారంగానే, కొద్దిమంది విద్యార్థు లుండేటప్పుడు, ఎదేనా అంశం వాళ్లకి వచ్చునో రాదో తేల్చడప్పువ్యాపారం ముఖాముఖిగా జరగచ్చు. జరుగుతూండేదికూడాను పూర్వం. అవి నోటిపరీక్షలు. ఒకొక్కవిద్యార్థి ఎదోశాస్త్రం పాపం ఏ పదిపన్నెండేళ్లో చావగొట్టి చదివి పరీక్షకొస్తే, పరీక్షకారుడు ఎక్కడిదో కొటివిలాంటి సంగిప్రశ్న వాణ్ణడిగి, ఆకాస్త ముక్కా వాడు చెప్పలేకపోతే, వాడికి అసలు ఆశాస్త్రంలో ఓనమాలు రావని తీర్పు చెప్పి పొమ్మనడం ఉండేది. అది న్యాయం అని ఎవరూ అనరు. కాని, వేనవేలు జనం గొడ్డలిపెట్టుగావచ్చి, "మాకు ఫలానాశాస్త్రం వచ్చును, మా మనస్సులో ఉంది, కావలిస్తే మా మనస్సులు తణిఖీచెయ్యండి" అని అడిగినప్పుడు, నోటిపరీక్ష అసంభవంఅయింది. పైగా, విద్యార్థుల్లో అంతరాలు చూసి ఆరాలు తియ్యవలసి వచ్చినప్పుడు, అందరికీ ఒకేకాలంలో అవే ప్రశ్నలు ఇవ్వడం ధర్మం. అంచేత రాతపరీక్షలు బయల్దేరాయి.

కొన్నికొన్ని రాతపరీక్షల్లో మూలగ్రంథాలు పక్కనిపెట్టుగుని చూస్తూ సమాధానం రాయచ్చు - ఆ మూలగ్రంథాలుమాత్రం ఓ వాగన్నవి ఉంటాయి. సర్వసాధారణంగా రాతపరీక్షల్లో మూలగ్రంథాలు ఓమూల పడేసి ఖరాగా వెళ్లి సమాధానాలు రాయాలి. మెట్టుమాట. ఇప్పట్లో పరీక్ష అంటే, మనస్సుని కొలవడానికి ఏర్పాటుచేసిఉన్న కొలమానంలాంటి ఒక పేపరులో ఉండే ప్రశ్నలకి సమాధానాలు రాయడం. పరీక్ష అనే మాటకి ఇది మూలార్థం కాకపోయినా, ఇందులో కూడా పరీక్ష కొరకు ప్రశ్నలు ఇవ్వడానికి వృత్తాంతం అంతటా చూడాలి, కుర్రాడి మనస్సు అంతటా చూడాలి, కుర్రాడు తన మనస్సు తను అంతటా చూసుగుని సమాధానం ఇవ్వాలి. మనస్సులో ఏమీ కనిపించకపోయినా, ఇటూ అటూ, గోడలూ, ఇంటికప్పూ పక్కైనా అంతటా చూస్తాడు. ఏమైతేం, ఈ రాత పరీక్షలు రక రకాలు: గవర్నమెంటువి, క్లాసువి, యూనివర్సిటీవి, వృత్తివి, పోటీవి, నౌకరీవి (అనగా సర్వీస్‌వి).

అయితే, ఈ పరీక్ష అనేది ఆదిని ఎవడు తెచ్చిపెట్టాడురా, మన నెత్తిమీదికి అని ఒక ఆసామీ విమర్శించి, ఒక చైనామనిషి కనిపెట్టాడని తేల్చాడు. చాలామూలం తెలియనివన్నీ చైనాలో పుట్టాయనడం వాడుకట. కాని ఒక హిందువుడు ఆ ఆసామీని ఖండించి, పరీక్ష అనేది ఇండియాలోనే వెలిసింది అని నిష్కర్ష చెయ్యడానికి రెండుసబబులు చెప్పాడు. ఒకటి — కృష్ణుడిచేత క్షేమంగా చూడబడ్డ పరీక్షన్మహారాజు పరీక్షల్ని సృజించా

షని. రెండు — అంతకుచాలా పూర్వమే, ప్రహ్లాదుడికిగురువైన చండామార్కులవారు మార్కులసంగతి యావత్తూ చాలా శ్రీరంగాకనిపెట్టారని. మొత్తంమీద, ఎక్కడపుడితేం చిరకాలం నించి ఈపరీక్షలు ఉన్నాయి, నలుమొహాలా పాకుతున్నాయి.

కాని, ఈపరీక్షల అట్టహాసం అంతా అసలు ఎందుకు? అనేది ఒకసమస్య. పరీక్ష సాధారణంగా రెండేసి మూడేసి గంటలుంటుంది — అనగా ఒక్కొక్క పేపరు. ఆ స్వల్పకాలంలో అది కుర్రాడిగ్రహణాశక్తి, విచక్షణ, జ్ఞాపకశక్తి, సమయస్ఫూర్తి, స్వయంకల్పనాశక్తి, వాక్యరచనాశక్తి, వగైరా బోలెడు కొలవాలి. కాని ఇన్నింటిల్లోనూ ముఖ్యంగా జ్ఞాపకశక్తి మాత్రమే ప్రస్తుతపరీక్షలు కొలవగలవు. అనగా, లోగడపుస్తకాల్లో రాసి ఉన్న వృత్తాంతం కుర్రాడిబుర్రకాయలో ప్రవేశించి మాయం అవకుండా ఉందాలేదా అని. కాబట్టి ఇల్లాంటిపరీక్షలో దేన్లోనేనా అయిదోఆరో మార్కులు తక్కినవాళ్లకంటె అదనంగా రావడం నుంచి అగ్రస్థానం ఆక్రమించినవాడు, ఎక్కువజ్ఞాపకశక్తి, రచనా కౌశల్యం కలవాడనవచ్చు గాని, ఎక్కువ తెలివిగలవాడనడానికి వీల్లేదు. ఇంగ్లండులో వెనకఉంటొచ్చిన రాంగ్లరుపరీక్షలో కొన్ని ఏళ్ళపాటు కృతార్థులైన వాళ్లసంగతి చూడగా, అగ్రగణ్యుల్లో పిక్కాపద్దులున్నా, రెండుమూడు స్థానాలవాళ్ళల్లో అఖండ ప్రజ్ఞావంతులూ అవుతొచ్చారట. అయినా సరే, ఈ పరీక్ష లెందుకంటే, తెలివితేటలు కనిపెట్టడానికంటారు కొందరు. మరొకాయన్ని అడిగితే, 'పరీక్ష అనేది కొందర్ని ఫేలుచేసి

పంపట్టాని' కన్నాడు. ఇంకోఆయన్ని కనుక్కుంటే 'పరీక్షల వల్ల పై అధికార్లకి కొంత ఆదాయం, అంచేతే ఈ పరీక్షల్ని నక్కల్లాగ పట్టుగుని వాళ్లూ దేవుల్లాడుతున్నారు.' అన్నాడు.

పోనీ, ఎందుకో అందుకు! పరీక్షకి మూలం ఏమిటీ అంటే ప్రత్యేకకమిటీలయొక్క ఆమోదంపొందిన టెక్స్టుబుక్కులు — అనగా నియమితగ్రంథాలు. అప్పుడప్పుడు, ప్రాలుబ్ధంవల్ల మంచి పుస్తకాలు నియమితగ్రంథాలుగా పడతాయి. మొత్తంమీద టెక్స్టుబుక్కు అనగా ఒక తద్దినం. అది తప్ప కడంవి అన్నీ బాగుంటాయంటాడు కుర్రాడు. అదివరదాకా గొంగళీ పురుగులా చీదరగా ఉండేచవటపుస్తకం, అప్రూవుకాగానే, రెక్కలొచ్చి ఎగిరిపోతుంది. ఒకపుస్తకం ఏదేనా పరీక్షకి నియమితం అయితే, చాలమందికి లాభం, కొండొకచో గ్రంథకర్తకీ లాభం. ఆగ్రంథంయొక్క ఖరీదులో అనేకమందికి వాటాలు ఉండడంవల్లే దానిఖరీదు చాలా జాస్తీగా ఉండి, గ్రంథంలో ఉండే పదార్థానికీ ఖరీదుకీ పోలిక లేకుండా ఉండడం. ఆలోచనా నూతనత్వంగల అపూర్వ గ్రంథం అయితే పైవారు ఓపట్టాన్ని ఆమోదించరు. ఒకొక్కగ్రంథాన్ని అబద్ధాలతో ముంచెత్తితేగాని పైవారు స్వీకరించరు. ఒకానొకప్పుడు పుస్తకంలో శృంగారం ఉన్నా ఫరవాలేదు. మరొకప్పుడు పుస్తకంలో రాసిఉన్న కొన్నికొన్ని సత్యవాక్యాలు తీసేస్తేగాని ఆమోదం దొరకదు. ఒకప్పుడు స్త్రీచేత రచింపబడితే సరి, పుస్తకం అప్రూవ్డే. అందుకనే, కొందరు పురుషులు, తమరే పుస్తకాలురాసి, అవి పైవారి

ఆమోదం పొందవేమో అనే భయం నివారించుకునే టందుకు, స్త్రీల పేరట అచ్చు వేస్తూంటారు! ఇంకొకప్పుడు, ఇంగ్లీషుకంపె నీలలో పడ్డపుస్తకం అవడంవల్లా, వేరొకప్పుడు విశేషప్రజ్ఞ లేకుండానే ఒకడు పుస్తకం రాసినందుకు ఆతణ్ని కాస్త ప్రోత్స హించాలనీకూడా అది నియమిత గ్రంథం అవుతుంది. బోలెడు లోపాయికారీ సంగతులు పురస్కరించుకుని ఆలోచిస్తేగాని వీట్లవయినం తేలదు. కుర్రాళ్ళు పఇబ్బందోపడి, నియమిత గ్రంథాలు కొంటారు — తెలుగువి తప్ప.

ఈలాంటిగ్రంథాల్నో, గ్రంథాలులేని సందర్భంలో విషయ సూచికల్నో, ఆధారంగా పెట్టుగుని, వాటిల్లో ప్రశ్న పరంపర — ఒక పేపరు — తయారు చెయ్యడానికి పరీక్షాధికారి ఉంటాడు. (అతణ్ణి నియమించడంలోకుడా లుక లుకలు బోలె డుంటాయి.) ప్రశ్న అడిగే వాళ్ళకి విషయం తెలియదని మనం అనుకుంటే తప్పు. అందుకని, అతడు విషయం చూపి, ఇంకా పరీక్షకొంతకాలం ఉండసగానే, పేపరు సిద్ధపరచి, మరి యిద్దరు అధికారుల్తో అది చర్చించి, అవసరం అయితే మార్చి, అచ్చుకి పంపడానికి ఇచ్చేస్తాడు. ఇంతకాండా జరిగినాసరే ఒకొక్క పేపరు అభాంద్రాగానే ఉంటుంది. ఒకొక్కడు, కుర్రాడికి ఏమి తెలుసునో కనుక్కునే ప్రశ్న అడిగితే తీరిపోనా, ఏమి తెలియదో కనుక్కుందాం అన్నట్టు ఎక్కడో మూలదాకున్న అల్పవిశేషాల మీద ఇరకాటపుప్రశ్న అడుగుతాడు. ఒకొక్కడు నియమిత గ్రంథం చదవకుండానే గట్టిపేపరు ఇస్తాడు. ప్రశ్న సూటిగా

ఉంటే ప్రతీవాడూ చెప్పేసి నెగ్గుకు పోతాడేమో గదా అనే విచారం చొప్పున ఒకొక్క పరీక్షకారుడు, ఆప్రశ్నని వంకర టింకర భాషలో పాతేసి ఇస్తాడు. తను ఏక్లాసుకి పేపరిస్తున్నాడో ఆక్లాసువాళ్ళకంటె ఎక్కువసంగతులు తనకు తెలియవని ప్రజలు అనుమానిస్తారేమో అని భయంవేసి కావును, ఒకొక్కడు ఆ క్లాసుకి పైవాళ్ళు చదివేసంగతులు ఆక్లాసుకి ఇస్తాడు. ఒకొక్కబద్ధ కస్తుడు, తీరుబడిలేక, — పేపరుఇచ్చినందుకు కొంత పుచ్చుగుం టాడు, అది వేరుమాట! - కుర్రాళ్ళకంట యింకా పడిఉండదు అని తనికి నమ్మకంఉన్న కొత్తపుస్తకంలోంచి ప్రశ్నలు అక్ష రాలాఇచ్చేస్తాడు, వాటిల్లో ఉండేదోషాల్తో సహా! ఒకప్పుడు పరీ క్షాధికారి అన్యదేశంవాడయితే పొరపాట్న పూర్వసంవత్సరపు నియమితగ్రంథంలోంచి ప్రశ్నలు ఇవ్వడం గాని లేక నియమిత గ్రంథం వ్రాసినకవిచేసిన మఱొక గ్రంథంలోంచి ప్రశ్నలివ్వడం గాని కద్దు. మరొకప్పుడు పరీక్షకారుడు ఏదేనా స్కూలుకి చెందినవాడైతే (ఎంచేతంటే కొందరుపరీక్షకారులు స్కూలు - పాఠంచెప్పడం - వగైరా ఎరగరు!) తన స్కూలువాళ్ళకి ప్రశ్నలు ఏచాటునో చెబుతాడు. మళ్లీ, ఒకొక్కడు తను పరీక్షలో ఇచ్చినవి మినహాయించి కడంవి కొన్ని కుర్రాళ్ళకి చెప్పి, అవే వాళ్ళచేత రుక్కెయ్యించి, చివరికి వాళ్ళచేత పబ్లికుగా వచ్చి బూతులు పడతాడు. కొందరు, తమరు కోరే సమా ధానం ఏమిటో స్పష్టంగా తమకే తెలియకుండానే ప్రశ్న లిస్తారు. వాళ్ల ఉద్దేశం, ఎవళ్ళూ రాయకపోతే అసలే తగాదా

లేదనీ; ఒకవేళ ఎవడేనా తనకినచ్చేటట్టురాస్తే, వాటిఆధారంవల్ల తక్కినవాళ్లవి విలవ కట్టచ్చుననీ, అందాకా యెందుకు! కొందరు పరీక్షాధికార్లని అధాత్తుగా కలుసుగుని జబ్బట్టుగుని కూచో బెట్టి వాళ్ళిచ్చిన ప్రశ్నలే వాళ్లకిస్తే, ఫేలవుతారు. ఒక చోట ఇద్దరు పండితులు కలిసి హిస్టరీపేపరు ఇచ్చారట. అందులో ఒకాయన (పాపం జాగ్రత్తపరుడు!) ఆ ప్రశ్నలకి నమోనా సమాధానాలు రాసి ఉంచుగుని, పరీక్ష కొచ్చిన నలుగురు కుర్రాళ్ళు రాసిన సమాధానాలు దిద్ది విలవ కట్టి ఆ మార్కులు వేరే ఓకాగితంమీద ఎక్కించుగున్నాడు. ఆయనప్రకారం నలుగురి కుర్రాళ్లపరీక్షా గోకేసింది. తరవాత, ఆయన ఆనాలుగు పేపర్లూ పేపరిచ్చిన రెండోపండితుడికి దిద్ది విలవ కట్టగలందులకు పంపించాడట. ఆపంపడంలో ఆనలుగురుకుర్రాళ్లు రాసిన సమాధానాలున్న కాగితాలూ కాక, తను రాసి ఉంచు గున్న సమాధానాలకాగితం కూడా పడిపోయిందిట పొరపాటున. ఈ అయిదు కాగితాలూ ఆ రెండోపండితుడుదిద్ది విలువకట్టి తేల్చిన ఫలితం ఏమిటా అంటే; ఆ నలుగురుకుర్రాళ్ళూ ప్యాసు, ఆ అయిదో కాగితంవాడు ఫేలూ! కొన్ని నెలలు ఆలోచించి ఇవ్వవలసిన ప్రశ్నలు ఇట్టే గోకి పారేస్తే ప్రమాదాలు ఉండక మానవుమరి.

సరి, పరీక్షలు ఇక ఓనెలో పదిహేనురోజుల్లో ఉందనగా చాలమంది విద్యార్థులులేస్తారు. సంవత్సరం పొడూగునా కొంచెం కొంచెం గ్రహించవలసినది ఓవారం పదిరోజుల్లో సాయంపట్టెయ్యో లేమా అని వాళ్ల ఊహ. ఆ పరీక్షకి ఒకరోడు కాక మూడేళ్ళు

ప్రైము ఇచ్చినా సరే, వాళ్ళు మూడోసంవత్సరపు చివరనెల లోనే లేస్తారు. అక్కణ్ణించి పరీక్షదాకా ప్రతిరాత్రీ మేలుకుంటారు. టీలు తాగుతారు. టీ తాగడానికి ఏ పదింటికో కొంత మంది ఏచోటో పోగవుతారు. బోలెడురాత్రిదాకా మేలుకుండి చదవాలిగదా అని, ముందు టీ కాయడం, తాగడం అయేవరకూ హాస్కడం. రెండుజాములకిగాని టీలు అవవు. అప్పుడు ప్రారంభించి కళ్లు జోతుల్లా అయి ఏదో పుస్తకంతీసి ఓపావుగంట వరకూ దృష్టి ఆ పేజీమీదే ఆమాటదగ్గరే ఆగిపోడం గమనించి, 'ప్రాప్తం ఉంటే అదే ప్యాసవుతుంది' అని ఆలోచన్లో పడి, దీపం కాగడాలాగ అల్లానే అట్టే పెట్టి కన్నుమూసి, ఎండొచ్చిన తరవాత ఉలిక్కి పడి మేలుకుంటారు. సంవత్సరాదినించీ చదివి అప్పణ్ణించీ పండితులై పోయి ఊరికే కూచునేకంటె, పరీక్ష నాలుగురోజులూ అఖండత్వం పెళపెళ్లాడిస్తే చాలదా అని వాళ్ల వాదన. కొందరు పరీక్షాధికార్లున్న స్కూళ్లనించి అంచనా ప్రశ్నలు తెప్పించుతారు. కొందరు, పేపర్లు కొనడానికి రహస్య సంఘాలు ఏర్పరిచి పోషకులకోసం వెతుకుతారు. రెండు వందలు ఇస్తే పోషకులు, నాలుగువందలికి రాజపోషకులు, వెయ్యియిస్తే మహారాజపోషకులు — ఇట్లా రేట్లు ఏర్పరుస్తారు. వాళ్లు, ఒకవేళ నెగ్గితే, తమకు టోకున కొన్నారు గనక, వ్యాపారం లాభం చూసుగుని చిల్లర్ని అమ్ముతారు. అప్పుడు పేపరు పదిరూపాయలకివస్తుంది. అల్లా కొనుక్కున్న వాళ్ళు మళ్ళీ కక్కూర్తికోసం మరీ చిల్లరగా ప్రశ్న రూపాయికాడికి వేలం

వేస్తారు. కొందరు, మేడీజీలూ, నోట్సూ, తీస్తారు. పెద్దవి చూడ్డానికి టైంలేక. ఇల్లా, చివరగడియలో చదవడం హిందువుల్లో ఎక్కువ అంటారు — అందులో ఆంధ్రుల్లో. ఎంచేతంటే, సంవత్సరం మొదట్నించీ చీమలా చదువుకునేవాణ్ణి పిరికివాడని ఆంధ్రులు ఏడిపిస్తారు. ఇన్ని పాట్లు ఆ వేళకి పడడం ఎందుకంటే, అది సహజం. మానవుడియొక్క సంకల్పం; తనకి ఎంత ప్రజ్ఞ ఉందో అంతకంటె ఎక్కువ ప్రజ్ఞ తనకి ఉన్నట్టు తను లోకానికి కనపడాలని.

తయారీ ఏ మోస్తరుది అయితేం, పరీక్షదినాలు వస్తాయి! కుర్రాళ్ళు రాతలు ప్రారంభిస్తారు. మొదటి పేపరుకి మాత్రం కొంత శ్రమించి చదువుతారు. తరవాతనించి, కలంలో సిరా పొయ్యడం. యంత్రంలా వెళ్ళిపోయి ఏదో వోటి రాసి చక్కారావడం. కొందరు, పరీక్ష ఇచ్చేచోటికి, వ్యవధానంలో చదువుకోడానికని మేటిడేసి పుస్తకాలు తీసుకెడతారు. పరీక్షకాలంలో వాచర్లు కొత్తవాళ్లు కొందరు వస్తారు. కొన్ని స్కూళ్ళ గోడల మీద ఆ టైముకి, "కాపీ పట్టుగుంటే బుర్ర ఎగిరిపోతుంది," "చంపేస్తాం రోయ్, జాగ్రత్త" "విల్లురాసి మరీ కాపీ పట్టుగో" అంటూ వాక్యాలు రాసి ఉంటాయి. టీలు తాగినవాళ్ళు కొందరు డోక్కోడం వగైరాలు ఉంటాయి. డబ్బోసి పేపర్లు కొనుక్కున్నవాళ్ళకి అనుకున్న ప్రశ్నలు కనిపించక, కళ్ళు చీకట్లు కమ్మొచ్చు. పాపం కొందరు తమ కొచ్చిందంతా ఒక్క దెబ్బలో మరిచిపోయి, ఇవతల కొచ్చింతరవాత అంతా ఏకరు

నెడతారు. కొందరు విద్యార్థులు, సమయం దొరకడంవల్ల, "మీరు ఇక్కడ నుంచోడం నాకు అడ్డండీ!" అనీ, "కాసిని నీళ్ళు కావాలండి మంచివి" అనీ వాచర్ల మీద అథార్టీ చేస్తారు. ఒకొక్కచోట పిల్లలూ స్కూలుతాలూకు వాచర్లూ ఏకమై, పరాయివాచర్ని గదిలో పెట్టి తాళంవేసి, (అతనికి మంచి టిఫిన్ లోపల ఉంచుతారట!) నియమితకాలం గడిచినతరవాత ఆయన్ని తీస్తారు. వాచరు ఏమాత్రమైనా ఎదిరిస్తే దభిగిణాకోం. పరిగెట్టుగు పోబోతే, తరిమి వెంటాడించి పట్టుగుని గుండెకింద కొడతారు. ఇక కాపీలల్లో రకాలు కావలసినన్ని. కాఫీతో బాటు కాపీకూడా ప్రబలించి. కొందరు కోటులోపల వేపున అంకెలూ గట్రా రాసుకుపోతారు. కొందరు ప్యాంటుచేత లోపలికి కిల్లీ తెప్పించుతారు, కాగితానికి చుట్టించి. ఒకడు చెప్పుల్లోగాని టోపీలోపలగాని కాగితాలు ఇరికిస్తాడు. మరొకడు అచ్చు కాగితాలు చింపి జేబులో వేసుకుపోయి, పేచీవస్తే నమిలి మింగేస్తాడు, అనుమానించినవాచరు తన్ని సమీపించేలోపల. ఒకొక్కనేర్పరి, తనపక్కవాడు సమాధానాలు రాస్తూంటే వాడిచెయ్యి కదలడాన్ని బట్టి అక్షరాలు పోల్చుగుని, తను కూడా ఆ సమాధానమే రాసేస్తాడు. ఒకొక్కడు, వాచరు వెనక్కి తిరగ్గానే, పక్కవాడికి సంజ్ఞలు చేసి వాడిదగ్గిర్నించి కొంత లాగుతాడు. కొందరు బ్లాటింగుపేపరుమీద రాసి, దాన్ని నడి పిస్తారు. పరోపకారపారీణుడైన ఒకడు తను సగం ప్రశ్నలకి మాత్రమే సమాధానాలు రాసుగుని, కడంవాటి సమాధానాలు

పక్కవాడికిస్తే అప్పుడు ఆపక్కవాడు ఆకాగితాలు చూసి స్వదస్తూరిలో సమాధానాలు రాసి ఇచ్చేస్తాడు. అది పూర్తిగా నెగ్గినప్పుడు ఆకాపీదాత అన్నదాత ప్రాణదాతలకంటె ఎక్కువ ఆనందపడతాడు, కాపీదానం పట్టినవాడు అవతలవాడిఋణం ఎన్నిజన్మలకైనా తీర్చుకోలేను గదా అని ఎంతో అంతగా ఇదవుతాడు. ఒకొక్కచోట, ఒకడే ఇద్దరిపేర సమాధానాలు రాస్తాడు. ఇంకోచోట ఒకడిబదులు మరోడువెళ్లి పరీక్షకికూచోడం కూడా ఉంటుంది. ఒకొక్కడు భంట్రోతుల్ని పైవాళ్ళనీ కట్టుకుని, కుట్టేసి సీలుచేసిన పాకెట్టు విప్పించి, లోగడ తను రాసినసమాధానాల కాగితం లాగేయించి, ఆస్థానే, తుడుపేనా లేకుండా నిండుసమాధానాలతో ఉన్న తాజాకాగితం జొనిపించి, మీసంమీద చెయ్యేసి ప్యాసవుతాడు. మరోకచోట, ఒక అల్పజ్ఞాసి, తనగదిలోనే పరీక్షకి కూర్చున్న ఒక అఖండుడి నెంబరు కనుక్కుని, తన సమాధానాల పుస్తకపు కవరు వాడిపుస్తకానికీ వాడిపుస్తకపు — అట్టా తన పుస్తకానికీ ఫిరాయింపించి తను ఫస్టుగా ప్యాసవడమే కాక, ఆ అఖండుణ్ణి హతమార్చేస్తాడు. ఎవడేనా వాచరు శాస్త్రంత రాల్చే స్వభావము కలిగి ఉన్నట్టు కనిపిస్తే, అతణ్ని పిల్చి కుర్రాడు రహస్యంగా 'భిక్షాం దేహి' అంటాడు. ఒకొక్క మర్యాదస్తుడు అంచనామీద రెండు మూడు ప్రశ్నలకి సమాధానాలు తయారుచేసి వెళ్ళి, "ఇవి చాలా ముఖ్యం. మీరు పారబట్టారు" అని చెప్పడానికి గావును అవి అడక్కపోయినా సరే

రాసి మరీవస్తాను. కొందరు, ప్రశ్నలకి సమాధానం తెలియక పోయినా ఎదోమహాశాస్త్రాన్నట్టు అభినయించి, రామకోటిగాని, రాజకీయవిషయాలు గాని, బొమ్మలు గాని గిలకడం. కొందరు దిద్దేవాళ్ళకి అర్జీలు కొడుతూ కూచుంటారు. ఒకడు, "నేను ప్యాసు కాకపోతే నాకు వచ్చిన ఒక ఎక్కా సంబంధం దూసుకు పోతుంది. ఆపాపం మీ మెణ్ణి చుట్టుగుంటుంది, కాబట్టి, ఏదో నీలుచూసుగుని నూటికి ముప్పైఅయిదు ప్రాప్తికి నాకు మార్కులు పారెయ్యించండి! ఇంతలో మీసొమ్మేమీ పోదు" అని రాశాడు. ఈలాంటి పిటీషనులు వృత్తిపరీక్షలో మరీజోరు. మేష్టరీ ట్రెయినింగుపరీక్షల్లో ఒకడు "అయ్యా! మాకిచ్చిన ఈ పేపరు మా పైగ్రేడుపీనుగులకి సమేతూ కొరుకు పడేట్టు లేదు గందా, ఇది మాకే ఇవ్వడంలో మీరు ఏమన్న పెద్దమను ష్యులు! ఒళ్ళు మంటుకొస్తుంది. ఫేలు చేస్తారు గాని అంతకన్న ఏం జెయ్యరుకదా!" అని రాసి కసి తీర్చుగున్నాడు. ఇంకోడు, "అయ్యా, నేను ఈడ్రాయింగు పరీక్షకి, దీనిమొహం ఈ వచ్చి, ఆరుమాట్లనుంచి అహోరిస్తున్నాను. నాకూ బొమ్మలకీ పడదు. ఏవో గీస్తాను గాని వాటికి జీవంరాదు. పైగా ఓజంతువు గియ్య బోతే మరోటి వస్తుంది. నాకు రెండుబళ్ల సంతానం. నేను ఈయేడు ఆడ్రాయింగు గట్టెక్కించకపోతే నన్నుతీసేస్తామన్నారు. మీరు నాకు పట్టెడన్నం పెట్టిస్తారా? నోటమట్టి కొట్టిస్తారా?" అని రాశాడు. అలాంటి అరవయ్యోపడి విద్యార్థుల్ని చూస్తే చాలా జాలేస్తుంది. తులసితీర్థం పుచ్చుగునేశైములో ఆతణ్ణి

విద్యనేర్చుగోమనడం ధర్మంలాకనపడదు. కొన్ని వృత్తిపరీక్షల్లో కాపీ పట్టింపు తక్కువ. పెద్దమేష్టరీ ట్రెయినింగు ఉంది. ఆ పరీక్షకి చదివినకొద్దీ మతిపోతుంది, పరీక్షాపోతుంది. చదవని వాడికి నచ్చేపరీక్ష అది ఒక్కటే. ముందు, ప్రశ్నయొక్క సంఖ్య వేసుగుని మరీ మొదలెట్టాలి, సమాధానం. ఎంచేతంటే, ఏప్రశ్నకి మనం ఆసమాధానం రాశామో మనమే పట్టుగోలేం. కొందరు ఆపరీక్షనిమిత్తం మూడో నాలుగో పాయింట్లు సంపాదించి, పేపరులో ఏప్రశ్నలున్నా సరే వాటికింద ఆపాయింట్లు మజా కాగా సర్దేస్తారు. ఇక ప్రైవేటుగా వెళ్ళేవాళ్లు. వాళ్లు పరీక్ష ప్యాస్‌కాకపోతే ప్రమోషను ఆగుతోందని పరీక్షకిముళ్ళీ కట్టడం, కట్టాం గదా అని పరీక్షఊరు పరీక్షవేళకి వెళ్ళడం, వెళ్ళాంగదా అని ఏదో రాయడం, రాశాంగదా అని ప్యాసవుతుందని అను కోడం — ఇంతేగాని సాధారణంగా చదువుకునివెళ్ళడం అంటూ ఉండదు. ఇల్లా వెళ్ళి వెళ్ళి కొత్తజ్ఞానం ఏమీ సంపాదించ కుండానే — ఏపరీక్షకారుకు మారిన రైములోనో — గుభుక్కుని ప్యాస్ అనడం.

ఈవిధంగా, తెలిస్తే రాతలతోటో, తెలియపోతే కోతల తోటో పేజీలునింపి, విద్యార్థులు తమపని తమరు కానిస్తారు. అస్పష్టసమాధానా లుండే ఇంగ్లీషులాంటి పేపరు అయింతర వాత, "ఎల్లాఉందిరా, ఇంగ్లీషూ!" అంటే, "ఏం? బాగానే ఉంది," అంటాడు ప్రతీవాడూకుడా. అప్పటి జవాబులధోరణి చూస్తే, "ఈ ఇంగ్లీషులో ఎవ్వడూ ఫేలే అవడా ఏమిటి

చెప్మా!'' అనిపిస్తుంది. కాని, స్పష్ట సమాధానాలుండే గణితం లాంటి పేపరు అయింతరువాత, "ఏంరా'' అంటే కుర్రాడు ఉత్సాహంగా మాట్లాడ్డమో, లేకపోతే మొహం తేలవెయ్యడమో జరిగి, కత్తిదెబ్బా అని తేలిపోతుంది. ఇల్లా తత్క్షణం తేలిపోతుందనే కొందరు గడసర్లు తమకి ఏ యే ఆన్సర్లు వచ్చాయో అవి మరిచిపోయాం అంటారు. కొందరు ఒకొక్క పేపరు అయిపోగానే ఇంటికొచ్చి దానితాలూకు నియమిత గ్రంథాలూ, నోట్సూ అన్నీ చక్కటిపొట్లలా చింపి గాడిపొయ్యిలో పోస్తారు. ఒకవేళ పేపర్లు గడువు కాలంలో వలే ఊరేగి పోవడంవల్ల పైవారు కొండో పరీక్ష పెడితే (ఖర్చుమూలాన్ని ఓపట్టాన్ని పెట్టరు) అప్పుడు చదవడానికి ఒక్కపుస్తకం ఉండదు. కొందరు జ్యోతిషం కనుక్కుంటారు — ఫేలయితే జ్యోతిష్కుడిమీదికి తొయ్యడానికి. కొందరు పరీక్షఫలితాలు తెలియక పూర్వం శుభం జరగడం పరీక్షకి జయప్రదం అని ఆలోపతే శుభముహూర్తాలు పెట్టించుతారు. ఫలితాలు తెలిసేవరకూ కొందరు గడ్డంపెంచుతారు. కొందరు, తమకి ఒకొక్కపేపర్లో ఎన్నిమార్కు లొస్తాయో అంచనాలు వేస్తారు. ఆ అంచనాల్లో ప్రతీవాడికీ ప్రతీ పేపర్లోనూ ఎంత తక్కువగా చూసుకున్నా ముప్పైఅయిదుకంటె పైగానే మార్కులు వస్తూంటాయి — ఎన్నిమాట్లు కట్టినా. కొందరు, తమరికి ఏ ఒక పేపర్లోనేనా సందేహంగాఉంటే తమ పేపరు ఎక్కడికివెళ్ళిందో తెలుసుకుని, ఎన్నివందలమైళ్ళయినా

సరే, ఆ ఊరు వెళ్ళిపోతారు. దిద్దేవాడి స్వభావం కనిపెడతారు. వాడిదగ్గిరికి వెళ్లేమార్గాలు చూస్తారు. ఆయన ఇంటిదగ్గిర లేనిసమయం అయితే, ఇంట్లో తమ నెంబరూ కొన్నివందలూ పారేసి పోతారు. లేకపోతే, ఆయనికి, ఆయన పై అధికారిచేతో, ఆయన అల్లుడిచేతో, ఆయన ఋణదాతచేతో, మరి ఇతర మొహమ్మాటస్థుడుచేతో చెప్పిస్తారు. పేపరుదిద్దేవాడు విషమస్థితిలో పడతాడు! ఈ దిద్దేవాళ్లల్లో ఒకొక్కడు మార్కులలుబ్ధావధాన్లు. అతని ఉద్దేశం ఏమిటి? — సరే, పేపరుకి మొత్తంమార్కులు వంద. అందులో దేవుడివి పది. అవి ముట్టుగోడానికి వీల్లేదు. పది తనివి. పది పై అధికారివి. పది అందానికి! మిగతావాటిల్లో తనకినచ్చినచోట సగంకంటె తక్కువగా ఇస్తాడు. ఇక కుర్రాడు తేలడం ఎల్లా! మరోడు, మార్కులసంతర్పి. ఈ రెండురకాలవాళ్ళనీ కుడా పై అధికారి కాస్త కసిరి, మధ్యరంగంలో ఉండేటట్టు మార్కుల్ని మరమ్మతు చేస్తాడు. ఈరీతిగా బాధపడుతూ, “మనసాయం, అఖండుడికీ అక్కర్లేదు, శుంఠకీ అక్కర్లేదు. ఇటూ అటూ గాకుండా మార్కులు వచ్చినవాళ్ళకి కావాలి. వీళ్ళనిముంచనా, తేల్చనా?” అని దేవుళ్లాడుతూ కుప్పనూర్పిడికింద ఒకొక్కడు పేపర్లు దిద్దుతాడు. కుప్పనూర్పిడి అంటే జ్ఞాపకం వచ్చింది — విద్యాధికుడూ వ్యవసాయదారుడూ అంటూ ఆరాలు తీస్తారుగాని, విద్యా వ్యవసాయమే. వ్యవసాయంలో ఉన్న లావాదేవీలు యావత్తూ విద్యకి అహోరించాయి.

రెండింటల్లోనూ ముల్లుకర్ర పుచ్చుగోవాలి ఓమాటేనా, పశు వుల్ని తోలాలి, విత్తనాలు చల్లాలి, కాపు కాయాలి, కోతలు కొయ్యాలి, కట్టలు కట్టాలి, కుప్పలు నూర్చాలి — ఫలితం దేవసహాయం. దద్దేవాడి దగ్గిర్నించి కాగితాలు వెళ్లిపోయా యని తెలిసింతరవాతకుడా, కుర్రాళ్లు ఇంకా ఎక్కడ ప్రయ త్నించాలో అక్కడ.

"తన్నైవైద్యుండు చికిత్సం బ్రోవంగలడో, యేమందు రక్షించునో" అని చరమప్రయత్నాలుచేస్తూ, ఎంతేనా సంతో షంగా ఖర్చుచేస్తారు.

అక్కడితో ఫలితాలు వస్తాయి. కొందరుప్యాసు, కొందరు ఫేలు. ప్యాసైనవాళ్లు తలెత్తుగుని నలుగురూ ఉన్నచోట నడు స్తూంటారు. వాళ్లకి అభినందనాలుకుడా వస్తూంటాయి. కొందరు, (వెనక) కొబ్బరికాయలు కొట్టడం, సత్యనారాయణ వ్రతం చెయ్యడంఉండేది. ఫేలయినవాళ్లలో కొందరు అది మరీ శిరచ్ఛేదంకింద భావిస్తారు. ఎవ్వడూ ఫేలవకుండా పరీక్ష ఎందుకు ఉండకూడదూ! ఎవ్వడూ ఫేలవకపోతే ఇక పరీక్షప్రయోజనం ఏమిటి అసలు అని కోప్పడుతూ మొదటికొచ్చే అధికార్లు కొంద రున్నారు. నూటికి ఏతొంభైమందో ప్యాసవుతూంటే భరించ లేక కళ్లమ్మటనీళ్లు పెట్టుకునేవాళ్ళు కొందరున్నారు. కల కత్తాలో నూటికి ౧౫ మంది ఫేలవుతారు! అల్లాంటప్పుడు ప్యాసవడంకంటె ఫేలవడం కష్టం. ఎంచేతంటే నూటికి ౮౫ మందిలో ఉండడంకంటె నూటికి ౧౫ మందిలో సద్దుకోడం

కష్టం గనక. అందుకని, మనలో మరీ ఎక్కువ మందిని ప్యాసుచేసి, పరీక్షలపటుత్వం చెడగొట్టి, దేశాన్ని పాడుచెయ్యకుండా, కొద్దిమందినే ప్యాసుచేస్తూంటారు. కాని, పామరులకీ సంగతులు తెలియవు. వాడు, ప్యాసైనవాడు మహానుభావుడనీ, ఫేలైనవాడు తెలివి తక్కువవాడేగాక, తుంటరికుడానని భ్రమిస్తారు. అయితే, పరీక్షఫలితాలు వచ్చినకొత్తరికం అల్లా అనుకున్నా, ఫేలయినవాళ్లలో చాలామంది అఖండులు ఉండచ్చునని కాలక్రమాన్ని గ్రహిస్తారు. కొంతకాలం అయింతరువాత, పుస్తకాలు మళ్లీ చూడకపోతే వాడూ వీడూ ఒకటే అని తెలుస్తుంది. అంతమాత్రాన్ని ఈపరీక్షారాధన ఎందుకో బోధపడదు. ఫలితాలు తెలిసినకొన్నాళ్లు హడావిడిగానే ఉంటుంది. ఒకొక్కడు పిలక్కి తాడుకట్టి తెగబట్టీవెయ్యడం, పరీక్షలో ఏమార్కులో వచ్చి చచ్చిచెడి అత్తిసరుపదునుగా ప్యాసవడం, "ఆc. నేను చదివిందేదిరా? జస్టు ఊరికే లీలగాచూశాను, ప్యాసైంది. మనం రొండోసారి చూస్తేనా?" అనడం. అసలుసంగతి, అతడేం జేసినా, అతణ్ని ఏంజేసినా, అంతకంటె ఎక్కువ ఒక్క మార్కురాదు. ఒకడికి నూటికి ౯౯ వస్తే, ఆ కడం అయిదూ తనికి ఇవ్వకపోయినందుకు పేపరు దిద్దినవాడు నరకానికి వెడతాడని, ఓ ఫేలైనవాడిదగ్గర వాదించడం — వాడసలు ఫేలై చదువుతూంటే! ఒకడు ఏమీ చదవకుండానే పూర్వజన్మాంతరాలవల్ల దాటి, తను బోలిడు చదివి పోడుం అయినట్టు "అబ్బ! మాచెడ్డ అప్సెట్

అయిందిరా సిస్టమ్! కొస్టు పృచ్ఛగోవాలి'' అనడం. ఒకో క్కడు పరీక్షఫలితాలు తెలిసినప్పుడు అత్తారింటిదగ్గర ఉండడం తటస్థించి ఫేలయితే అద్భుతమైన కారణాలు చెబుతాడు—
"చూడండీ అత్తా! మాస్కూలు తాలూకు సమాధానపు కాగితాలు ఒక కర్కోటకుడికి వెళ్లాయండి. అందులో కర్మం! నాబుక్కు ఆకాగితాలకట్టలో పైనేఉందిట. ఆ కర్కోటకుడు అప్పుడప్పుడే ఇంట్లో ఏదో దెబ్బలాడి వచ్చాడేమో, ఆపళంగా నాపుస్తకం మొదట్లోనే ఉందికాదూ, దానిమీద ఒక్కసున్నా పెట్టి, నన్ను బలేసి పారేశాట్ట''అని. మొత్తం మీద ప్యాసులూ, క్లాసులూ, వగైరా మూణ్ణాళ్ల ముచ్చటలు.

ఇన్ని సంగతులూ, ఇంకా లక్షా, జరిగిన తరవాత వచ్చిన ఫలితాలమీద ఆధారపడి తెలివితేటలూ, ఉద్యోగార్హతా నిర్ణయించడం న్యాయం అని చెప్పలేం. కొందరు అసలు పరీక్షలు తీసేస్తే పీడ వదుల్తుందని వాదిస్తారు. కాని, విద్యఉన్నంత కాలం పరీక్ష తప్పదు. ఎంచేతంటే, విద్యబోధించి చెప్పాలి. బోధనకి ప్రశ్న, సమాధానం ఉండాలి. ప్రశ్న పరీక్షయొక్క చిహ్నం. అందుచేత, ధనికులైన ఇతర దేశీయులు కొత్త పరీక్షలు కనిపెట్టి, ఆచరణలో పెట్టి, పైనిచెప్పిన అన్యాయాలు తగ్గించాలని చూస్తున్నారు. మనప్రస్తుతపరీక్షలు కొండని ముక్కలకింద కొట్టమంటాయి.కొత్త పరీక్షలు, చిన్న చిన్న ముక్కల్ని గబగబా పోగుచేసి కొండలా పేర్చమంటాయి. మన పరీక్షలవిధానం మారాలీ అంటే, మనుష్యులు మారాలి. అనగా మనస్సులు

మారాలి. కాలం జరిగితే గాని మనస్సులు మారవు. పరీక్షల కోసం, మార్కులకోసంమాత్రమే బాధపడేవాడికి, విద్య అంటదు. విద్యకోసం పాటుపడేవాడికి పరీక్షవల్ల బాధేఉండదు. ఎంచేతంటే, వాడు ప్రతీకొత్తసంగతీ పరీక్షవల్లే నేర్చుకోవలసిన అవసరం ఉండడంచేత, వాడికిపరీక్ష మామూలైపోతుంది. పరీక్ష నాలుగుపూటలూ ఏ అరువుముక్కలో ముక్కున్పెట్టుకొని తెలివి గలవాడికిమల్లే కనిపించి, ఆకాలానికి పూర్వాపరాలు మరొస్తుడై ఉండడం మానవుడు కోరుకోకూడదు. అసలు జీవితం ఒకపెద్ద నిత్యపరీక్ష. జీవితపరీక్షకి ఎప్పుడో తయారు అవుతానుపో అనడంకాక, ఎప్పటికప్పుడు తయారుగా ఉండడం మానవుడి విధి. అటువంటి ధన్యుడి జీవితం ఆదర్శం. నమస్కారం.

# "మన" తెలుగు

[౬-౫-౫౮ వ తారీఖున తెలుగుదేశంలో ప్రసిద్ధికెక్కిన రాజమండ్రీ గౌతమీ గ్రంథాలయపు రం - వ వార్షికోత్సవ సందర్భంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు యొక్క అధ్యక్షప్రతినిధిగా రెండవసారి ఉంటూ దేశదేశాంతరాల్లో ప్రఖ్యాతులైన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతకింద జరిగినసభలో ఈప్రసంగం చాలాపసందుఅయింది. ప్రసంగం 'మన తెలుగు'యొక్క స్థితిగతులగురించి. 'మన' అనేమాట మనభాషలోనే ఉందిట. మనమతంలాగే మనభాషకూడా చాలా సమిష్టికుటుంబం. చెప్పేదాల్లో తెలుగుభాషయొక్క విశేషాలుగనక మీకు స్ఫురణ

కొస్తే అవి 'మన' తెలుగువే అనిన్నీ, లోపాలుగాని కన పడితే అవి 'నా' తెలుగువనిన్నీ అనుకోండి. ఇది నా హృదయంలో ఉండడంచేత మీ సెలవుప్రకారం పైకి నేను చెప్పుకుంటూన్న బాధేకాని ఉపదేశంఅనిమాత్రం మీరు ఎంచకండి. ఉపదేశంచెయ్యడానికి నాకు అర్హత లేదు. అసలు దేశంలో బలంఉంటేగాని ఉపదేశంలోనూ బలం ఉండదు.]

భాషఅంటె సంస్కారంపొందిన ధ్వని. భాషలు ధ్వనులు. భాషలనుగురించి చెలరేగే వాదప్రతివాదం కోలాహలం. ఒక దేశాన్నుంచి మరోదేశానికి మానవులు ఏవర్తకం నెపంమీదో ప్రయాణాలు మాననంతకాలం భాషలకి సంపర్కం మానదు. సరిహద్దుల్లో బహుభాషాసంపర్కం తప్పదు. సంపర్కంఉండడం తోటే సంబంధం, సాంగత్యం, సాంకర్యం, సంఘట్టన మొదలైనవాటిల్లో ఏదేనా ఏర్పడచ్చు. కొత్తమనుషుల్ని మన నెత్తి నెక్కించుగోడానికి మనం ఒప్పుగుని వాళ్ల భాష మన నెత్తి మీదిది కాదనుకోడం అజ్ఞానం. ఇట్లాంటిసందర్భాల్లో మెత్త మెత్తనివాళ్లని గట్టివాళ్లు కంఠంనొక్కి దవడశుద్ధి చేస్తూంటూరు. ఆమెత్తనివాళ్ళు ఒకొక్క చెంపకాయే శాస్త్రప్రకారం తింటూ, 'ఈనూటు కొట్టుమరి చూస్తానూ!' అంటూండడం, ఇల్లా కోరినప్పుడు ఊరుకుంటే బాగుంటుందా అనిచెప్పేసి గట్టివాళ్లు వెనకటికంటె ముదరరకం చెంపకాయి పీళ్లని లాగుతూండడం కద్దు. ఆమెత్తనివాళ్లు తమస్థితిని పట్టిగెల్లి తమ ప్రారబ్ధకర్మానికి ముడెట్టుగుని నిశ్శబ్దంగా ఆగట్టివాళ్ళని చావ

తిట్టుగుంటూండడం. తెలుగు సంగతికూడా అల్లా అయిపోయింది. దేశీయాంధ్రం అనేది తెలుగువాళ్ళల్లో లక్షకోడికి తెలియొచ్చు. అట్లాంటి తెలుగులో రెండుమూడు గ్రంథాలూ ఎరుగుదుం, సజీవులై ఉన్న వాళ్ళల్లో ఇద్దరుముగ్గురుపైగా రచయితల్ని ఎరుగుదుం. కాని, నూటికి నూరుమంది పైచిలుకు మాట్లాడే తెలుగు కలగాపులగమే. ఈపులగంలో సంస్కృతం, పార్సీ, ఇంగ్లీషుమాత్రం జోరుగాపడ్డాయి. తెలుగుయొక్క మెత్తదనంవల్లే ఇన్నిన్ని భాషలపదాలూ బాణాల్లాగ హృదయం నాటేలాగ తెలుగులో గుచ్చుకుపోయిఉన్నాయి. తెలుగు శరీరంలో వాటిని నిల్చిఉండనిస్తే అవి సెలలువేసి ప్రాణం తీసేస్తాయని కొందరూ, లేక వాటిని పైకిలాగిపారేస్తే వెంటనే ప్రాణపోకటలని కొందరూ! అప్పట్లో సంస్కృతానికున్న మన్నన బట్టీ, సంస్కృతాన్ని పరిపూర్ణంగా తెలుగులిపిలో రాయడానికుండే వీలునుబట్టీ, తెలుగువాళ్ళకి ఇహపర సాధనాలైన శాస్త్రాలు సంస్కృతంలో ఉండబట్టీ, ఎన్నో సంస్కృతపదాలు ఆపళంగానే తెలుగైపోయాయి. తెలుగులోంచి వాటిని ఇప్పుడు తీసెయ్యడం ఎల్లా? తురకరాజ్యకాలంలో వేషం, అలంకారం, ఆభరణాలు, కచేరీలు, కొలుఖత్తులులాంటివాటికి సంబంధించిన పదాలు వందలాదిగా తెలుగైపోయాయి. వాటిని ఇప్పుడు చెడనాడుకోడం ఎల్లా? అట్లానే కుంపినీరాజ్యం జోరబడ్డది లగాయతు ఇంగ్లీషువాళ్ళు ఏదోజీవితావసరం అనిపించే నూతన సాకర్యం — స్టీమరు, రోడ్డు, పోస్టు, టెలిగ్రాఫు, ఎలెక్ట్రీ (అనే

చాలామంది తెలుగువాళ్లు అనగ(లు,) నీళ్లపైపు, కాఫీ హోటలు, మిల్లులు, సైకిల్, మోటారు, ఎయిరోప్లేను, గ్రామొఫోను, సినీమా, టాకీ, రేడియో [ఇకముందు టెలివిజన్, యూనిఫర్ స్లేన్] లాంటివి తెచ్చి తెలుగువాళ్లల్లో పారేస్తూండడం, ఒక్కొక్కపట్టు ఓపాతికేసి ఇంగ్లీషుమాటలు మనకళ్లముందు తెలుగైపోతూండడం ఎరుగుదుం. వీటిని ఇప్పుడు అప్రయత్నంగా బళ్లో కెళ్లి ఇంగ్లీషు చదివిఉండని తెలుగువాళ్లంతాకూడా వాడతారు. తెలుగు సంభాషణలోకి ఆరీతిగా ఎక్కి స్థిరపడి పోయిన ఇంగ్లీషుమాటల్ని ఇప్పు డెల్లా తీసెయ్యడం? మచ్చునూ యడం అంటే మాటలే! ఏకర్మంవల్లో ఒకేమహాప్రవాహంలో మనుష్యులు పడ్డప్పుడు, వాలుకేసి మొఖం పెట్టినవాళ్లనీ ఎదరకేసి మొఖంపెట్టి గుంజుకునేవాళ్ళనీ ఉభయుల్నీకూడా ఆప్రవాహం వాలుకేసే ఈడ్చుకుపోయి గిరవ టెడుతుంది, ఎటొచ్చీ వాలుకేసి తిరిగిన వాళ్లు కాస్త సజావుగా వెడతారు, ఎదరకేసి తిరిగిన వాళ్లు వెల్లగిత్తులా పడతారు.

ఆమీదట ఒకటి జరిగింది. కేవలం తెలుగుకాకుండా మరొక భాషగాని విషయంగాని బాగా తెలిసి ఉంటేతప్ప ఉద్యోగం డబ్బూలేని ఒక తెలుగువాణ్ణి ఆంధ్రేతరులూ ఆంధ్రులూకూడా ఒకపండితమాత్రుణ్ణిగానేనా కట్టడం మానేశారు. లోకంలో చాలామంది గొప్పవాళ్లకి తెలుగు రాకపోబట్టి, తమకికూడా తెలుగురాకుండాపోయి, రాదని తమరు చెబుతూంటేగాని తెలుగు వాళ్లల్లో గొప్ప సంపాదించడానికి వీల్లేదని కొందరు తెలుగు

వాళ్లకి నమ్మకం కలిగిందా అనిపిస్తుంది. కాలక్రమాన్ని 'విద్య' అన్నా, 'చదువు' అన్నా 'పాండిత్యం' అన్నా ఆదిని సంస్కృతంలోనే అనిన్నీ పదపడి ఇప్పట్లో ఇంగ్లీషులోనే అనిన్నీ అనుకునేటంత వ్యామోహం తెలుగువాళ్లల్లో ప్రబలింది. పురాతనవిజ్ఞానం ధరించిన దవడంచేత సంస్కృతానికి జ్ఞానులు మొదటివోటు ఇచ్చారు. పిదప వచ్చిన రాజకీయ పరివర్తనంవల్ల పార్సీకి మోజుఉండేది — 'దేవతాభాషల తీపు లేమియు గావు, పారశీకోక్తులు ప్రణుతికెక్కు' అని తిమ్మకవి దుఃఖించాడు. దరిమిలాని ఇంగ్లీషు వెలసింది. మొదట్లో గుమాస్తాగిరీవిషయంలో అవసరమై, నేటివరకూ అది అల్లానేఉండగా, అక్కణ్ణించి, లోకంతో వ్యవహరించే విషయంలో, నవీన విజ్ఞానాభివృద్ధి గమనించేవిషయంలో, నవ్యప్రపంచరాజకీయ పరిస్థితి గుర్తెరిగేవిషయంలో, వేదశాస్త్రాల్లో ఏముందో చెప్పిన దొర్లపుస్తకాలు చదువుకోడం విషయంలో, నూతన శాస్త్ర పరిశోధనవల్ల తేలిన సారాంశాలప్రయోగంవల్ల మానవుల యొక్క ఐహికసౌఖ్యాభివృద్ధికి తోడ్పడే అపూర్వసాధనోపాయాలు అవగాహన చేసుగుని లాభంతియ్యడం విషయంలో, ఇంగ్లీషు ప్రాణావసరం అయిపోయిందని చాలామంది ఒప్పుగుంటారు. అందుకని, దేశావసరమైన పూర్వపుసంగతులు యావత్తూ సంస్కృతంలో ఉండడంవల్ల అవి నేర్చుగోడానికి తెలుగు అక్కర్లేనట్టే, నేటిప్రపంచం తెలుసుగోడానికి తెలుగు అక్కర్లేదు. కాదు - ఎంతమాత్రం చాలదు. ఇంగ్లీషుంటే, అంతకూ

మరోఅందుకూకూడా నయం. ఒకవేళ నేటి సజీవప్రపంచాన్ని గురించి రాసినగ్రంథాలు తెలుగుని ఉన్నా, అందులో కొత్తవి అని పామరులు అనుకునేసంగతులు ఇంగ్లీషులోంచో మరో పర భాషలోంచో చెప్పో, సైములేకచెప్పకో అనువదించి, కుదించి, దించి, అనుసరించి, అనుకరించి తంటాలుపడ్డబాపతు పోదూ అని నిరసన. 'తెలుగులో అపూర్వమేధావంతులు చేసినస్వతంత్ర రచన మనం నేర్చుగుని మన్నించతగ్గది లేదు' అని ప్రతీగొప్ప తెలుగువాడికీ విశ్వాసం. తాను తక్కిన తెలుగు మూక కంటె గొప్పవాడవడంచేతనే అల్లాంటి విశ్వాసం కుదుర్చుకో గలిగానని వాడిఊహ. సనాతనత్వం, దేవత్వం, సర్వతో ముఖత్వంకలిగిఉండడంవల్ల సంస్కృతాన్ని వదలలేని తెలుగు వాళ్లున్నారు. సంస్కృతంనేర్చి ఆభాషలో కావ్యాలురాస్తే తీరి పోనా, అట్లాఎంచేతో చెయ్యక, తెలుగులో గ్రంథాలు రాస్తూ 'నల్లేరుమీద బండి అన్నట్టు అసలే నామరూపాలు లేకుండా అణగారిపోతూన్న తెలుగుమీదికి సంస్కృతరథం తోలుకొచ్చి తెలుగువాళ్లని పచ్చడిచేసే తెలుగువాళ్లూ ఉన్నారు. దర్జా, హోదా, దబాయింపు, ఉద్యోగార్జన, గొప్పవాళ్లతో సహ వాసం తద్వారాస్వలాభం లాంటివాటికి వీ లుండడంవల్ల బోల్లేరు ఇంగ్లీషుముక్కలు వదల్లేని తెలుగువా ళ్లున్నారు. దర్జాకోసం ఓజిల్లాబోర్డుమెంబరు (ఆయన్ని బోర్డునెంబరు అంటేగాని ఆయనకి కోపంవచ్చేది!) "నేను మొన్న మెడ్రాసు వెళ్లినప్పుడు ఆంజినీలుహోటల్లో భోంచేశాను. అక్కడ లిప్టన్

అరణ్యామెంటు బాగుంది" అన్నాడు. తరవాత వాకబుచేస్తే — ఆంజనీలంటే డి యాంజిలిస్ ట, లిఫ్టన్‌అంటే లెట్రిన్ ట. పల్లెటూళ్ళల్లో పోతూ ఇంగ్లీషు మాట్లాడిఅక్కడి 'బైతు'లచేత దణ్ణాలెట్టించుగుని చాకిరీచేయించుగునే తెలుగువాళ్ళున్నారు. కారు నడిపేవాళ్ళు తమరికి పది పన్నెండు వర్ణక్రమం తెలియని ఇంగ్లీషు మాటలు వచ్చుననేగా మనుష్యుల్ని పశువుల్ని సమంగా డబాయించడం! ఎండి శుష్కించిపోయిన పూరాతనపు ఇంగ్లీషు సరుకు — రెండుమూడువందల ఏళ్ళనాటిది — ఏటి కెదురీది పిక్కవేసి నేర్చి ఉద్యోగాలుచేసే అస్మదాదుల్ని తమరు ఎరగనే ఎరుగుదురు. గౌరవానికి లోటనేభయంచేత తెలుగుయాసతో ఇంగ్లీషుమాట్లాడే జనాన్నికూడా ఎరుగుదుం "దేర్ ఫోరూ, ఐ వెన్టూ! వాట్! దెనోన్లీ ఐ వెన్టూ! యూ సీడ్నాటు క్రైయ్యా ఐ సెడ్డు" మాదిరిగా. ఇంగ్లీషుముష్టి బాగా కిడుతుందని గావును కొందరు ఈమధ్య ఇంగ్లీషులో ఎత్తుతున్నారు. అక్కణ్ణించి, తెలుగులో క్రియలేకపోబట్టి, క్రియలన్నీ, ఇంగ్లీషులోనే జరిపే తెలుగువాళ్లులేస్తోచ్చారు — మాట్టాడ్డం, నడవడం, కోప్పడ్డం, తినడం, ఏడవడం, 'పశ్యన్' వగైరా అన్నీ. పెళ్లానికి ఇంగ్లీషురాదు, వదిలెయ్! తల్లిదండ్రులకి ఇంగ్లీషురాదు, పాతెయ్! భంట్రోతుల్ని? ఇంగ్లీషు రాకపోతే తీసెయ్. తెలుగువాళ్లల్లో విద్యాధికులైన గొప్పవాళ్లతో ప్రసంగిస్తే ఈకింద యిచ్చిన నమోనానసమాధానాలు లాంటివి వినిపిస్తాయి:

ప్రశ్న — సంస్కృతంమాట ఏమిటి?

జవాబు – బతికున్నవాళ్ళ కెందుకూ! ఒకవేళచచ్చి స్వర్గాని కెడితే దేవుడితో సంభాషించచ్చు!

ప్ర – ఇంగ్లీషు?

జ – అల్లాఅన్నారు, అల్ రైట్! బానిసలమైన మనమే కాదు, కొమ్ములుతిరిగినవాళ్లుకుడా ఇదినేర్చుగుంటున్నారు. ఇంగ్లీషుని ప్రపంచభాష చెయ్యడానికి ఇంగ్లండువాళ్లు వీరకంకణం కట్టి రాగిం పదాలు ఇంగ్లీషుని జల్లించి తీసి, వాట్లతోనే వెనకటి ఇంగ్లీషుగ్రంథాలన్నీ పిరాయించి రాస్తూన్నారు. ఎంతసయం!

ప్ర – హిందీ?

జ – అచ్ఛా! అందులో హుషార్, మజా ఉన్నాయి. అయితేం? లిపి నాకు రాదు.

ప్ర – పోనీ తెలుగు?

జ – ఛీ! తెలు గేమిటీ చప్పగా! నాబోటిగాడి కేమిటుం టుంది అందులో! స్టైల్!

ప్ర – తెలుగుపుస్తకాలు?

జ – తర్జుమా, తత్సంబంధం, తస్కరణం. నామనస్సుకి విందుగాగాని, ఆహారంగాగాని, పథ్యంగాగాని ఆఖరికి చిరితిండిగా గాని ఉండేదేనా లేదు.

ప్ర – తెలుగులో పాతరచన?

జ – ముసుగు! విజ్ఞానశూన్యం. పైగా అదంతా అదివరకే సంస్కృతంలో అంతకంటె రమ్యంగా ఉండేసిన బాపతుట!

ప్ర – తెలుగులో కొత్తరచన?

జ — అగమ్యం, సంకరం, అసభ్యం, నీరసం.

ప్ర — చదివి చూశావా?

జ — కిట్టదు. అందుకనే చదవను. చదవకుండా చెప్పడం మాత్రం కళ కాదా?

ప్ర — తెలుగులో పాతచిత్రకళ?

జ — అంతా ఇంగ్లీషు. అందులో పురాణస్త్రీలుకూడా దొరసాన్లలానే ఉంటారు.

ప్ర — కొత్తచిత్రకళ?

జ — బాబూ ఇది బెంగాలీషక్కీ. అన్నీ "భావబొమ్మలు."

ప్ర — తెలుగులో పాతపాటలు?

జ — ఇప్పటి మూర్ఖులూ వెనకటిస్త్రీలూ వినడానికోసం.

ప్ర — కొత్తపాటలు?

జ — గంధర్వ, వ్యాస్, — ఇమిటేషన్, ఒక్క త్యాగయ్య వినా — అతడేనా అరవదేశంలో ఉన్నాడుగనక. అతడికేనా తెలుగు బాగారాదు.

ప్ర — తెలుగు ఫిల్ములు?

జ — మంచిది ఒక్కటీలేదు. నిశ్శబ్దంగా ఉండే సినీమాలోకివెళ్లిన తెలుగునటుడు లేడు. ఇప్పుడు సశబ్దంగాఉండేటాకీలో ముందు బుక్కై తరవాత తుక్కుగాని తెలుగుజనుడు లేడు.

ప్ర — తెలుగు పత్రికలు?

జ — కొన్ని ఇంగ్లీషువాటికి పుత్రికలు. కొన్ని ఆమ్రేడితాలు. కొన్ని ప్రచారమాత్రాలు.

ప్ర — తెలుగుయంత్రపరిశ్రమలు?

జ — పేపరుమిల్లు, బట్టలమిల్లువగైరా కొన్నింటిలో తెలుగు లేదు, తక్కిన వాటిలో పరిశ్రమే లేదు.

ప్ర — తెలుగువాళ్ల విదేశవర్తకం?

జ — అది సాగుతూండేది అన్యభాషాపరిచయంవల్లే. తెలుగు వల్ల కాదు.

ప్ర — తెలుగు పరపతి సంఘాలు?

జ — కొన్ని నరపతిసంఘాలు, కొన్ని తిరపతి సంఘాలు.

ప్ర — తెలుగుప్రజల ధనాలయాలు?

జ — కొన్ని సుప్రజాలయాలు, కొన్ని స్వప్రజాలయాలు, కొన్నిలయాలు.

ప్ర — తెలుగులో భీమాలు?

జ — కొన్ని హేమాలు, కొన్ని కామాలు.

ప్ర — తెలుగునాయకులు?

జ — కొందరే, చాలామంది వినాయకులు.

ప్ర — తెలుగు విశ్వవిద్యాలయం?

జ — అదంతా తెలుగుదికాదు.

ప్ర — అయితే?

జ — అప్పుడూమజా! అదీ మెడ్రాస్ ఇమిటేషన్! పరీక్షల కార్ఖానా!

ప్ర — కొత్తశాఖ లున్నాయే!

జ — ఇంకా ఉండాలి. తెలు గవాలి.

ప్ర — డబ్బుండాలిగదా. అంతా తెలుగైతే అన్యదేశాల్లో మనపట్టాలు సాగవేమో?

జ — అన్యదేశాలు వెళ్లనేవద్దు!

ప్ర — పోనీ తెలుగురాష్ట్రం?

జ — అట్టెట్టె! ఆగాలి! సౌరాష్ట్రం!

విచారణచేస్తే సంస్కృతం దేవలోకభాష. ఇంగ్లీషు భూలోకభాష. ఉర్దూ యోధలోకభాష. 'ఉర్దూ' అంటే యోధులు విడిసేస్థలం అని అర్థం. యుద్ధానికి పూనుకొనేసమయంలో వివిధ భాషల యోధులకీ ఉర్దుభాషలోనే హెచ్చరికోపన్యాసం ఇస్తూంటారని చెబుతారు. మరి తెలుగో! ఇది ప్రస్తుతం గొప్ప తెలుగువాళ్ల పట్ల పనికిమాలిందిలాగ ఉన్నభాష. మహాఅంటే దీన్ని గానభాష అనచ్చు. అందుకనే అరవలు తెలుగుకీర్తన్లూ జావళీలూ నేర్చి తెలుగువాళ్లకి శ్రవణానందంచేసి సొమ్ముచేసుగుంటూరు. వీటివల్ల వాళ్లకొచ్చే ఆదాయం చూస్తే 'అరవలు తెలుగుపాటలు అర్థంచేసుగోలేరు' అని విచారించేవాళ్లు అర్థం చూడకుండా పోతున్నారన్నమాట. ఈమధ్య తెలుగువాళ్లు అరవల్ని ఏదో అన్నారని అరవలంతా ఏకమై — ఎందెందులో ఎవరెవరు ఏకమైనా అసలు మెచ్చతగ్గదే! — ముందుముందు తమరు చేసే పాటకచేరీల్లో త్యాగయ్యకీర్తన్లు పాడడం మానెయ్య దల్చుకున్నారని వదంతి. అదే నిజమైతే, వాళ్లు త్యజించేది త్యాగయ్యనిగనక అందహా సరిగ్గా (త్యాగయ్య — త్యాగయ్యర్ — త్యాగయ్యెట్ సూత్రప్రకారం) త్యాగయ్యర్లు అయి

ఊరుకుంటారు.

ఏతావాతా, తెలుగులో విద్యనేర్చినవాడికీ తక్కిన తెలుగు వాడికీ మానసికంగా చాలా దూరం అయిపోయింది. కేవల తెలుగువాడికి ఉండే భావాలూ అభిప్రాయాలూ అసలైన భావాలూ అభిప్రాయాలే కావని విద్యాధికుడైన తెలుగువాడు అనుకునే కర్మం తెలుగుదేశానికి పట్టింది. అందుకని అభి ప్రాయాలుగల తెలుగువాడూ అంటే మానసికంగా ఇంగ్లీషు భాషలోనో, సంస్కృతభాషలోనో, ఉర్దూభాషలోనో — తెలుగు తప్ప మరొకభాషలో — ఆలోచన కానిచ్చుగునే తెలుగువాడు అని తెలుస్తోంది. కాబట్టి, తెలుగు విద్యా ధికుడికి స్వంతానికి తెలుగు అవసరం లేదు. స్నేహితులు కలిసి నప్పుడు గొప్ప తెలుగువాళ్లు తెలుగులో మాట్లాడుకోరు. ఫక్తు ఇంగ్లీషు చేతకాక-పరభాష పరభాషేమరీ - అందులోనూ మాట్లాడుకోలేరు. అదీ యిదీ ఏదీకాని "ఎంగిలీషు"లో ముచ్చ టించుగుంటారు. కొందరు గాంభీర్యంకోసం; కొందరు వ్యవహా రంలో కోపంవచ్చి; కొందరు తీరా తెలుగైతే ప్రతీ వీధెంట వెళ్లేవాడూ 'ఇదిట్రా! అబ్బాయి తెలివి!' అని తన సంగతి కని పెట్టేస్తాడేమో అని; కొందరికి అలవాటు; కొందరికి నైసర్గికం; కొందరు తమ అన్యభాషా భావానికి తెలుగులో - తన తెలు గులో - పదాలు అసలేలేక; కొందరు వాళీఅవడంచేత; కొందరు తమరికి వచ్చినా మెచ్చేవాళ్లు లేరనే దుర్ధర్కొద్దీ! బజారు చెయ్యా డానికి గొప్ప తెలుగువాడు వెళ్లనే వెళ్లడుగనక తెలుగుఅక్కర్లేదు.

వెళ్ళినా ఓయ్యాభై తెలుగు మాటలు ఎక్కీ-తొక్కీ-నూ! గొప్ప తెలుగువాడు తెలుగుటాకీ బాగుండదని ముందే తెలుసుగుని దానికి వెళ్ళడు. అందుకని టాకీవిషయంలో 'హిందీ' గాని, 'ఇంగ్లీషు' గాని రావాలి, చాలు. అరవం వచ్చినాచాలు. అరవ త్యాగరాజు ఫిల్ముకి తెలుగుదేశంలోనే డబ్బు ఎక్కువ వచ్చిందని ఆ ఫిల్మువారు అన్నారన్నారు. కాఫ్యాలయానికి వెడితే ఉప్మా సాంబార్ లాంటి అరవం, అరకప్ అరప్లేటులాంటిఇంగ్లీషు చాలు, తెలుగు అక్కర్లేదు. కోర్టుల్లో కొంతవరకు సంభాషణ తెలుగుని జరుగుతుందిగాని, అది ఆంగ్లంలో పెడితేగాని తెలుగు ఫిర్యాదీ హృదయబాధ న్యాయమూర్తిగారి తలకెక్కదు. ధర్మశాస్త్రం అటు సంస్కృతంలోనూ ఇటు ఇంగ్లీషు లోనూ ఉంది. ఇదమిత్థం అని న్యాయం తేల్చడానికి తెలుగు వాళ్ళకి తెలుగు అవసరంలేదు. అందుకనే న్యాయం తేల్చలేరు, ఓ పట్టాన్ని తేల్చూండదు. ఆస్పత్రుల్లో సంస్కృతం, ఇంగ్లీషుకాక మందుపేరు గూఢంగా ఉండాలని ల్యాటిన్‌కుడానూ. రోగాలకి తప్ప తెలుగు లేదు. సభల్లో, ఈమధ్య ఒక్కరవ్వ మరీ తరుచుగా, ఉపన్యాసాలన్నీ తెలుగులోనే ఉండాలని మహా చెడ్డ పట్టుదుతున్నారు. కాని ఆ పట్టుపట్టేవాళ్ళల్లో కొందరు ఇంగ్లీషులోనే మాట్లాడుతూ "టెలుగు ఓన్లీ టెలుగు, యూ మస్ట్! మస్ట్!" అని కేకవేసే తెలుగువాళ్ళు ఉంటూంటారు. ఇక బళ్ళల్లో తెలుగు! బడిఅంటే ఇంగ్లీషుబడి. గుమాస్తాల్ని తయారుచేసే నిమిత్తం ప్రభుత్వంవాళ్లు తమరిభాష నేర్పేబళ్లు. పఠించే విష

యాల్లో తెలుగు ఒకవిషయం. వాళ్లధర్మమా అని, ఆ విషయాల్లో ఏ రెండో భాషగానో తెలుగుని ఉంచారుగనక గాని, లేకపోతే చాలామంది తెలుగువాళ్లు తెలుగు అక్షరాలేనా చూడకుండా పెరిగిఉండేవాళ్ళు. వెనక బళ్లల్లో తెలుగుతప్ప కడం విషయాలన్నీ ఇంగ్లీషునే. కొంతకాలానికి బళ్ళు తెలుగు మారాయి. ఇప్పుడు తెలుగు మరో మెట్టుదాకా నిర్బంధించారు. అయినా తెలుగుస్థితి అల్లానేఉంది. అక్కడ తెలుగు స్థితి మచ్చుచూస్తే దేశంలో తెలుగుయొక్కస్థితి సరిగా బోధపడుతుంది. ఆ స్థితీ, అందుకు పుణ్యంకట్టుకున్నవాళ్లూ, వాళ్ళ వాటాలూ: అదో పెద్ద గాథ.

ఇంత అధ్వాన్నంగా తెలుగుస్థితి ఉంటూండగా కొంత కాలంనించి హిందీ గురించి హంగామా జరుగుతోంది. ఇన్ని కోట్ల తెలుగు జనంలోనూ – స్త్రీ పురుష బాల వృద్ధ పండిత పామరుల్లోనూ – ఎన్నిలక్షలమంది ఎవరెవరు హిందీలో ఏమాత్రం పాండిత్యం ఎన్నేళ్ళల్లో నేర్చి అందులో ఎంతమంది పరిపాలక వర్గంలో ఉద్యోగాలు సంపాదించి తెలుగుదేశాన్నీ, దాంతోపాటు తక్కిన హిందూదేశాన్ని ఎన్ని అంగుళాలు పైకి లేవదీస్తారూ అనేది చూడవలసిన విషయం. కొన్ని వందల ఏళ్ల నించి తెలుగువాళ్ళకి ఇంగ్లీషే రాజభాష. పొట్టకోసం కొందరు తెలుగువాళ్లు పుస్తకమాత్రం అయిన పాతఇంగ్లీషు నేర్చారు. ఈ పాత దినుసేనా తెలిసినవాళ్లు ఇప్పటికీ మొత్తం మీద వెయ్యోవంతు ఉండరు. గట్టుమీద ఈతనేర్చుకున్నట్టు తెలుగు

దేశంలో ఉండి ఇంగ్లీషు చదవడానికి ఇన్నేసేళ్ళు పడుతోంది గాని, అక్కడికి వెళ్ళేస్తే ఓ రెండుమూడు మాసాల్లో కావలసినన్ని ఇంగ్లీషు పిడుగులు నోల్లుకురావచ్చు. గొప్పవాడవాలనే ఆశతో తెలుగువాడు ఆ స్తైనాలన్నీ నేటివరకూ దొరికినంత ఇంగ్లీషు చదువుకుంటున్నాడు. తెలుగువాళ్ళల్లో ప్రతీవాడూ ఇంగ్లీషు చదవాలనిగాని, చదివితే తమరికి ఉద్ధరింపనిగాని, చదవకపోతే తమరికి అరిష్టం అనిగాని, ఇంగ్లీషువాళ్లు చెప్పాలేదు, ఏడవాలేదు. ఇంగ్లీషు సారస్వత చరిత్రలో ఇంగ్లీషు పండితులైన తెలుగువాళ్ల పేర్లు ఎక్కుతాయని నమ్మడానికి వీలు కనిపించదు. తెలుగుతండ్రులే కోరుకుని, తమసంతానం పాలితులైన తెలుగువాళ్ళల్లో చిక్కడిపోకుండా పాలకులైన ఇంగ్లీషు వాళ్ల వర్గంలో జేరితే లాభమూ గొప్పాకదా అని వాళ్ళకి ఇంగ్లీషు చెప్పించారు. అట్లాంటివాళ్ళకికూడా ఇంకా బాగా మొహం మొత్తలేదు. అల్లానే హిందీనూ. చావగొట్టి ఏదీ చదివించలేం. చావగొట్టినా తల్లిభాష రానివాళ్లకి చచ్చినా పరభాష రాదు. అందుకని, ఏమీ అక్కర్లేదు, మీదపెడితేసరి తప్పకుండా వస్తుంది. రావడమేకాదు. ఇది మాభాషే మేం వదలం అంటారు. కాని, ఒకబరువు ఇంకా మీద ఉండగానే మరోటిపెట్టడం అధర్మం. అయితే, చిన్నప్పట్నించీ తెలుగు వాడికి హిందీలాంటిది చెప్పకపోతే వాడు తల్లిభాషలో కాస్త కుదురుకుంటాడుగనుక, తరవాత తరవాత ఇంకోభాషలోకి స్వత్వం చంపుకుని మారడు. అందుకని, ఉగ్గుపాలతోటే తెలుగు

వాడికి పరభాష చెబితే, పరభాష తనదే అనుకోడం తన తల్లి భాషని నిరసించడం, పరమతం పరజ్ఞానం వగైరా బాగున్నాయనుకోడం, తన అసలుమతం అసలుజ్ఞానం నాసిరకం అనుకోడం, పరదేశం తనదనుకోడం, తనదేశం మట్టి అనుకోడం వాడికి సహజం అయిపోయి, వాడు మరి తెలుగు తెలుగంటూ ఏడవడు. ఇంగ్లీషుభాష విషయములో ఇల్లా అయింది! మరోదానికీ ఇల్లానే జరగవచ్చు! అక్షరాస్యులైన తెలుగు జనంలో చాలామంది 'హ' గుణింతం, 'త' వత్తూ తెలియక 'హ' 'త' శ్రేణిలో చేరినవాళ్లం ఉంటూంటే 'హిందీ' వచ్చి వీళ్ళ నోటపడి ఏమి హింస పడుతుందోగదా అని దిగులు! హిందీ ఒకవిధమైన ప్రాకృతం — వ్యావహారిక సంస్కృతం, సంస్కృతానికి ఛాయ. అల్లాంటప్పుడు ఛాయని పట్టుగుని దేవుళ్ళాడ్డం ఎందుకు? దేశభాషలకన్నింటికీ తల్లివేరైన ఆ అసలు వస్తువు సంస్కృతమే అన్నిచోట్లా నిర్బంధంగా చదివిస్తే నలి వొదిలిపోతుంది అని కొందరి నమ్మకం. సంస్కృతమే వస్తే హిందీ, మందీ, ఉన్నదీ, లేందీ అన్నీ కూడా వచ్చేస్తాయని. "అమరోక్తులు సకలభూములందును వెలయున్" అంటాడు అప్పకవి. కాని, సంస్కృతానికి ఒక ఆక్షేపణ ఉండొచ్చు. అది ప్రస్తుత రాజకీయాధికారం ఉన్నవాళ్ళకి వచ్చునో రాదోట. అయితే మాత్రం? రాజకీయావసరాల్ని బట్టి కొన్ని ఇతరభాషలు నేర్చి తీరవలిసినట్టే, ప్రజలభాషకూడా పరిపాలకులు నేర్చాలి. అంతేగాని పరిపాలకుడిభాష ప్రజల్లో ప్రతీవాడికీ యుగం

తిరిగినా రాదు. రానక్కర్లేదు. కాబట్టి ఇతరభాషల గురించి భయపడడం అనవసరం. ఏస్థానం తెలుగు కిచ్చి తెలుగుయొక్క అపరిమితమైన వాడకం తెలుగువాళ్లందరికి తప్పనిసరి అయే సందర్భాలు ఏవేవి కలగిస్తేయుక్తమో మొదట చూసుగోడం తెలుగు వాళ్ల ధర్మం. అప్పుడు తెలుగులోనే వివిధ సంస్థల నిమిత్తం వివిధ పరిభాషలు ఏర్పడాలి — తెలుగు మతగ్రంథాల్లో పరిభాషా, తెలుగు జ్యోతిషాది గ్రంథాల్లో పరిభాషా, తెలుగున్యాయస్థానాల్లో పరిభాషా, తెలుగు రాజకీయంలో పరిభాషా, తెలుగు పాఠశాలల్లో పరిభాషా — ఈ రీతిగా. అక్కణ్ణించి ఇన్నిన్ని శాఖల్లోనూ వాడుతూండే తెలుగూ, నిత్య కృత్యాలకి ఉపచరించే పామరుల తెలుగూ వృత్యాసంగా ఉండడం, పారిభాషిక పదాల్లోంచి కొన్నొచ్చి సంభాషణలో పడడం, సంభాషణలోంచి కొన్ని పదాలు వెళ్ళి ప్రత్యేకస్పష్టార్థాల్తో పారిభాషిక పదాలుగా వెలవడం, ఇల్లా ఇచ్చిపుచ్చుగోడాలు జరగడం, ఉభయతారకంగా అది పరిణమించడం, తెలుగుదేశంయొక్క జ్ఞానం క్రమంగా ఒకొక్క పైమెట్టెక్కడం సంభవించవచ్చు. అందుకని ముందు నా తెలుగుకి, నాభాషకి నేను నా హృదయంలో ఉచిత స్థానం ఇస్తాను. నేను తెలుగుని గౌరవిస్తాను, మన్నిస్తాను, ఆరాధించి సేవిస్తాను.

చ. నినుసేవింపగ నాపద ల్వొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుం డననీ మహోత్ముడననీ, సంసారమోహంబు పై

తోనసీ, జ్ఞానము గల్గనీ, గ్రహగతుల్ గుండింపనీ, మేలు వ
చ్చిన రానీ యవి నాకు భూషణములో శ్రీకాళహస్తీశ్వరా.

అని ధూర్జటిదీక్ష తెచ్చుకొని 'శ్రీయాంధ్రభాషేశ్వరి' అనుకుంటాను. నేను తెలుగు వాడతాను, ఉపయోగిస్తాను, పలుకుతాను, ప్రాణహానివస్తేరా తెచ్చే వ్యవహారాటంకం కలిగే టప్పుడు రెండోపక్షంగా ఇతరభాషలు — వాట్లకి తలవంపులు రానీకుండా — నేరుస్తాను. అందానికీ, అలంకారానికీకూడా వాటిని తెచ్చుకుంటాను, నాయిష్టంఅయితే. అయితేనేం? నా తెలుగు నాతల్లిభాష, నాతల్లిహృదయం, నాతల్లిమనస్సు,నాతల్లి. నాతల్లిని నేను మన్నించడంవల్ల నాకు లాభమూ, నష్టమూ నేను తర్కించను. నేనుజంతువుల్లో జమ అయిపోకుండా ప్రప్రథమం లో నా జిహ్వలో ప్రవేశించి, నాముఖతా పైకొచ్చి, తద్వారా నాజన్మ సార్థకపరిచిన ఏ తెలుగుభాషఅయితే ఉందో, ఆ తెలుగు తల్లిని నేను — ఈజన్మఎల్లానూ చాలదు పరభాషాదత్తం అయిందిగనక, — ఎన్నిజన్మలెత్తిసేవిస్తే ఆవిడఋణం తీరుతుం దోకదా అని ఆదుర్దాపడుతూంటానుగాని, దీన్ని సేవిస్తూకూ చుంటే నాకు కిట్టుతుందా కిట్టదాఅని బేరంచేస్తూ అహోరించను. గొప్పవాళ్లైన నా తెలుగువాళ్లేవళ్లేనా నా తెలుగు వినిపించు కోకపోతే నేను బాధపడను. ఎప్పటికేనా తెలుగుకి అర్హత, అవసరం, గణ్యత, గౌరవం వస్తాయని విశ్వసిస్తాను. తెలుగున ఆలోచించి, తెలుగుజనాన్ని జ్ఞాపకంఉంచుగుని. తెలుగు హృదయంనించి అభిప్రాయం తెలుగులో చెబితే తెలుగుజనం ఆలకించి

తీరతారు అన్నధైర్యంతో ఉంటాను. అప్పుడు వాళ్ళకికూడా నాకు కలిగిన చిత్తవృత్తిలాంటిది కలిగితీరుతుందని భావిస్తాను. స్వతంత్రరచన తెలుగులో లేదని చెప్పేవాళ్లు అంతమాట అనవలిసినఅర్హులు కారని తలుస్తాను. సంస్కృతవిజ్ఞానసారం ఆంధ్రభారత స్రవంతిద్వారా పూర్వమే మనకి అందచేసిన నన్నయ తిక్కనామహుల్ని జ్ఞప్తికి తెచ్చుకుని, భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూసి మరీ మాట్లాడాడా అనిపించే పోతన్నని తల్చుకుని, సంస్కృతవాణితో చెట్టాపట్టాలుపట్టించి తెలుగు తల్లిని యావత్తు తెలుగునాటా దిగ్విజయంగా ఊరేగింపించిన శ్రీనాథుణ్ణి స్మరించి, మూడువరసజన్మల్లో ఒకేపాత్రయొక్క అనుభవాలు రాయగలిగిన సూరన్నని, బ్రహ్మ సరస్వతుల పవిత్రశృంగారచేష్టలు వర్ణించి ఎక్కడికి పూర్తయిన చేష్టలు అక్కడికి గుచ్చెత్తి బ్రహ్మచేత చిలక్కి కథగా చెప్పించి సరస్వతిచేత కథకి అర్థంచెప్పించి కవిబ్రహ్మ సంకల్పించింది అక్షరాలా భూమిమీద జరుగుతుందని చూపించిన సూరన్నని, చలన — వెన్నెల — అందం — సౌరభం — కోమలత — మధు రత్వం అనేవి తెలుగుతల్లికిలక్షణాలని ఇన్నిలక్షణాలూగల మాట ల్లో అనేసిన సూరన్నని, ముందుకి ఒకభాషలోనూ వెనక్కి మరో భాషలోనూ ఏకకాలమందే నడవగలిగిన సూరన్నని, నవ్యశాస్త్ర పరిజ్ఞాతలు ఇంతవరకు ఇంకా కనిపెట్టలేకుండాఉన్న అద్భుతాలు వెనకే ఊహించేసిన సూరన్నని మరీమరీ స్మరించి, అతిసుఖ వుగా అపారఐహికాముష్మికజ్ఞానం ఆటవెలదిముఖతా పలికిం

పించిన వేమన్నని నెమరికి తెచ్చుగుని, తెలుగుయొక్క గౌరవ ప్రతిష్ఠలు ఎక్కడతగ్గిపోతాయో — అన్యభాషాహతంఅయి తెలుగు తనస్వత్వాన్ని ఎక్కడ పోగొట్టుకుంటుందో — తెలుగులో కామధేనువుల్లాంటి పదాలు ఎక్కడవట్టిపోతాయో — ఏచిన్న తెలుగుపదం ఎక్కడఉండడంవల్ల జీవిస్తుందో — ఏ పదాలు ఏక్రమంలోసర్దుకొని కూర్చినవాణ్ణీ నేర్చినవాణ్ణీకూడా ఉభయులూఅనుకోని భావందగ్గిరికి ఎగరదీసుకుపోగలవో — రకరకాలనవీనవిజ్ఞానాన్ని తెలుగులో ఎల్లాపాకించడమో, తెలుగుజిహ్వ, పెట్టిపుట్టడాన్ని ఏమేమిటిఅనేసి సఫలంచేసుగోవాలో — అంటూ తెలుగుగురించి తెగతాపత్రయ పడిపోతూ ఇహంలో మెప్పుమాటగాని డబ్బుమాటగాని పరంలో మోక్షాశగాని తెలుగువల్ల ఉండవు అని అనుభవంలో తెలిసీ కూడా, కాళ్లట్టుగు ఈడ్చేస్తూన్నా చూరట్టుగు వేళ్లాడుతూ, తెలుగులోనేజీవిస్తూ, తెలుగే వాడుతూ, తమ:చిత్తవృత్తులకీ తెలుక్కీ తాదాత్మ్యం ఆరోపించుగుని తెలుగులోనే ఆలోచిస్తూ తమరిహృదయనాళాలమీదినొక్కులు తెలుగువల్లే కలిగాయి అనుకుని తమరి పెదిమిలు తెలుగు అనడానికే దేవుడు చేశాడనుకుని, తెలుగు భాషాసంప్రదాయాన్ని ఇన్నాళ్ళనుంచీ నిలబెట్టుగుంటూవచ్చిన తెలుగుఅధ్యాపకు లందరికీ తెలుగుపండితు లందరికీ తెలుగురచయితలందరికీ — అంతకంటె ముందు ఇతరులై పుట్టినా సోదరులైన బ్రౌన్, గెలెటీవంటివాళ్ళకీ — నమస్కారం చేసి, ఒక్కక్షణం ఆగి, వెనక్కిచూచి, మరీప్రత్యేకంగా,

తెలుఁగదేల యన్న దేశంబు దెలుఁగేను
దెలుఁగువల్లభుండ, దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ యెఱుఁగవే బాసాడి
దేశభాషలందు దెలుఁగు లెస్స

అనే మృదువైనమాటలు గంభీరమైనభావంతో అనగలిగిన “సాహితీసమరాంగణసార్వభౌము”డైన శ్రీకృష్ణదేవరాయల్ని సవినయంగా తల్చుకుని, ఎంతచెడ్డా నేటివరకూ తెలుగుని యథాశక్తిగా నేర్చినా నేర్చకపోయినా పోషించుగొస్తూన్న తెలుగురాజాల్ని మెచ్చుగుని,

తెలుగుదేశం స్వతంత్రంఅయి దేశములోఉండే గొప్పసంస్థల్లో తెలుగు విస్తరించి, తెలుగువాళ్లల్లో గొప్పవాళ్లు తెలుగుని లేవనెత్తి, దాన్ని మొదటవిధిగా హృదయంలోనూ, వీలైతే కంఠంలోనూ, అధమం శిరస్సుమీదా పెట్టుగున్నప్పుడే తెలుగుయొక్క ప్రతిభా, తెలుగుయొక్క వ్యక్తిత్వం తెలుగుయొక్క జీవం సిద్ధిస్తాయని ఆశిస్తాను. (సెప్టెంబరు 1935.)

# దశరూపకం

## ౧

మందపిల్లి,
౧౯-౧౧-౩౮.

రసరాట్టుగారికి నమస్కారములు —

మహాశయా! నాన్నగారు మా తోటారంభూములమీదికి శిస్తువసూలు వగైరాలకి వెళ్లారు. పదిరోజులక్రితం తమపేరట ఒక వచనరచన పంపిఉన్నాను. మరి ఆలస్యం కానీయక దాని మీద తమ సదభిప్రాయం పంపండి. తిరుగుటపాలో పంపాలి.

ఇట్లు,
గోపీనాథం.

జబాబు

పేరారం,
౨౦-౧౧-౩౮.

గోపీనాథానికి ఆశీర్వచనాలు —

అబ్బాయీ! ఏదో ఆలస్యం అయింది. ఏమీ అనుకోకు. నాకు మీ నాన్నగారొకటీ నువ్వొకటీ కాదు. ఇదుగో:

ఈగ్రంథం ఆంధ్రానికి ఒకఆస్తి. అక్కడక్కడ దీంట్లో మామూలుదోషాలు లేకపోలేదు కాని, కొన్నిపట్ల ఇది ఎంతో హృద్యంగా ఉంది. ఇటీవలిదిన్నీ మాండలికమున్నూ అయిన పోతభాషవాడితే నేంపోయె, చేతభాషకూడా పాళంగానేపడింది.

అతి తెలివిసంకరసమాసాలు బలే విరివిగానూ మహాజోరుగానూ లేవని చెప్పలేంకాని, జటిలత్వం నిండుకుంది అనడానికీ వీలులేదు. పాండిత్యంలో లోటుకీ కథలోని నీటుకీ ఉర్జీ సరిపోయింది. ఇది ఉత్తమోత్తమం అని వ్రాయజాలం కాని, దీన్ని నీచకావ్యంఅని కొట్టి పారెయ్యడానికీ మనస్కరించకుండా ఉంది. మొదలు ఎట్లా ఉందో చివరంటా అంతే.

ఇట్లు,
ర స రా ట్.

౨

మ ం ద ప ల్లి,
౨౧ - ౧౧ - ౩౮.

రసరాట్టుగారికి సమస్కృతులు —

ఆర్యా! తపుజబాబు చేరింది. క్షమించవలె. మొన్న నేను తమకు రాసిన ఉత్తరం పొరపాటు. తమకు ఆరచన పంపినట్టు జ్ఞాపకముండి అట్లా రాశాను. ఈవేళ తీరా చాకలితెచ్చినకోటు తొడుక్కోగా, నా కోటు జేబులోనే ఆరచనకూడా ఇస్త్రీఅయి ఉండిపోయింది. ఇప్పుడే వేరొకకవర్లో పెట్టి ఆరచన మీాకు పంపాను. ఆకాగితాలు విప్పేటప్పుడు జాగ్రత్త. నామీాద దయ ఉంచి మంచి అభిప్రాయం పంపండి.

ఇట్లు,
గో పి.

జబాబు — పేరారం,

౨౨ - ౧౧ - ౩౮.

గోపీ! మరొకరికి పంపవలసిన ఉత్తరంనీకు వేశాను. నువ్వు కొంచెం అసాధ్యపు పిల్లకాయలా ఉన్నావు. నువ్వు కవిత్వం కూడా రాస్తావని లోగడ నే నెరగను. ఇదిగో:

ఈకవి సుప్రసిద్ధ పండితపుత్రుడు. ఇతివృత్తం ఒక మహా పురాణంలో అసలైనపట్టు. కాని, ఈరచనలో అనుభవం తక్కువ. ఆవేశానికి తుల్యమైన ఆరిందా లేకపోవడం సహజం గనక, లేదు. ఉంటే అడిగారూ! ఉన్నతప్పులు కుర్రతప్పులు గనక క్షమించవచ్చు. ఈకవికి భవిష్యంలో మంచి విలవ వస్తుంది. ఇప్పుడైనా, రచన నవనవోన్మేషం, మహామెత్తని శయ్య, పరిశుభ్రమైన ధార. పాండిత్యంలో కనబడేలోటుకుడా కాలక్రమాన్ని, అన్నీసర్దుకున్నట్టే, సర్దుకుంటుంది. మూంచి అక్కరకొచ్చే చెయ్యి, సవ్యసాచి. భరతమాతకి ఇల్లాంటి సంతానం అవసరం.

ఇట్లు,

రసరాట్.

## 3

మందపిల్లి,

౨౩ - ౧౧ - ౩౮.

రసరాట్టుగారికి వందనాలు. తమజాబు అందింది. ఆ రచన నాది కాదు. సలాం.

ఇట్లు,

గోపి.

జ బా బు

పే రా రం,
౨౮ - ౧౧ - ౩౮.

గోపీ! నువ్వింకా ఏముటో అనుకున్నాను. తగ్గవాడివే. మొత్తంమీద చణక శాస్త్రిల్లుగారి అబ్బాయి ననిపిస్తున్నావ్. ఆరచన చెయ్యడంపాటి తెలివితేటలు నీదగ్గిర లేకపోతే పోనీ అది ఎవరు రాశారో ఆసంగతేనా నాకు రాయవలిసి ఉంటుం దనేనా నీకు ఇంగితజ్ఞానం ఉండకూడదూ! ఇదుగో:

ఈరచన మంచిది. భాష చక్కనిది. వస్తువు అందమైనది. రీతి కులాసాగాఉంది. వృత్తి గౌరవముకలది. ఈకవికి హిందూస్తానీకూడా తెలుసు. వెల స్వల్పం. ఫల మధికం, చక్కనిసైజు.

ఇట్లు,
ర స రా ట్.

౪

మం ద పి ల్లి,
౨౯ - ౧౧ - ౩౮.

ఆర్యా! మా నాన్నగారు గ్రామాంతరం వెళ్లేటప్పుడు ఈ రచనమీద అభిప్రాయంకోసం ఇది మీపేర పంపించమని నాతో చెప్పారు. అన్నట్టు, మీరు వారికి బాకీఉన్న లెఖ్ఖగురించి వ్రాయమనికూడా అని వెళ్లారు.

ఇట్లు,
గో పి.

జబాబు                    పేరారం,

౨౬-౧౧-౩౮.

గోపీ! అల్లా చెప్పావురే! అందుకనే, ఈ రచన మిక్కిలి ఉత్కృష్టం. కవి కేవలఛాందసుడు కాడు. ఒకటోరకమైన చాదస్తంలా పైకి కనిపించేది యావత్తూ ఫక్తు చేవ, గుంజు. ఇంటులో అపారపాండిత్యం గంగాతరంగాలవంటి నిమ్నోన్నత భావాలలో చదువరిన్ని ముంచి లేవనెత్తుతుంది. పాండిత్యం ఇంత సద్వినియోగం చేసినవాళ్లు లేరు. ప్రాచీనసంప్రదాయం ఇక్కడే నిల్చింది. మారుమూల పదాలకి ఈరచన కాణాచి, అపరూప కారకాలకి ఈరచన దిక్కు, పురాణేతిహాసాలకి ఈరచన ధర్మ సత్రం. నేలబారు రోకలిబండలు ఎగర్లేని మహోన్నత కవితా గిరిశిఖరాలలోనే ఈకవివాణి విహరిస్తుంది. గ్రహించే బుర్ర లుండాలిగాని, నవీనవిజ్ఞానం అనబడేదికూడా చణకశాస్త్రిగారి యాక్రొత్త రచనలో ఉంది. నాదీ పూచీ!     ఇట్లు,

రసరాట్.

X

మందపిల్లి,

౨౭-౧౧-౩౮.

అయ్యా, రసరాట్టుగారూ! తమజాబు అందింది. మా నాన్నగారు కవిత్వం రచించగలరని మాకు తెలియదు. ఈరచన ఆయనదికాదేమో! అయినా, నమస్కారం.     ఇట్లు,

గోపి.

జవాబు

పేరారం,
౨౮ - ౧౧ - ౩౮.

గోపీ ! ఇహానేమ్మరి ! నేను అప్పుడే అనుకున్నాను. అందుకనే ఈరచన రమ్యంగానూ గంభీరంగానూమాత్రం ఉంది. శైలి మృదు మధురంగానూ, ప్రాయశః భయజనకంగానూ, సర్వత్రా నాతి కఠినపదభూయిష్ఠంగానూ ఉంది. కవి ఇటువంటి రచనలు ఇంకా మేట్లకొలది రాసి, బతికుండగానే అచ్చుకొట్టి, చచ్చో చెడో అందరికీ ఉచితరీతిని వాటిని అందజేసి ధన్యుడై తరించును గాక.

ఇట్లు,
రసరాట్.

౭

మందపిల్లి,
౨౯ - ౧౧ - ౩౮.

రసరాట్టుగారూ ! ఇంతటితో ఊరుకుందాం అంటే వీల్లేని పరిస్థితి ఏర్పడ్డది. నిన్న మాయింటికి నే లేనప్పుడు ఒకాయన మానాన్నగారికోసం వచ్చారని మాఅమ్మ చెప్పింది. ఆయన తాలూకు ఒకరచనమీద అభిప్రాయం తెప్పించి యిస్తానని మానాన్నగారు వారికి వాగ్దానంచేసి రచన పుచ్చుకున్నారుట. ఆయనపేరు తెలియదు. చూపులకి కొత్తపంథినే బియ్యేలా

ఊరుకున్నాడని మాఅమ్మ అంది. మీకు నేను పంపింది ఆయన రచనేమో!

ఇట్లు.
గోపి.

జ వా బు

పే రా రం.
౩౦ - ౧౧ - ౩౮.

గోపీ! అసలు నేను మొదట్లోనే అల్లాఅనుకున్నాను. ఈకవి ఇంగ్లీషు చదివినవాడు. ఇంగ్లీషులో తను చదువుకున్నదంతా మక్కీకిమక్కీ ఇందులో ఫొట్టిగ్రాఫు దింపేశాడు. ఈసరుకు ఎక్కణ్ణించి దిగుమతీ చేస్తున్నాడో చెప్పడు. ఆసంగతి తెలుగు ఘటాలు ఎక్కడ కనిపెట్టొచ్చారని ఇతనిఊహ. రచనంతా ఇంగ్లీషుకంపే. ఉద్బోధనగాని ఉత్తేజనగాని ఇందులో లేవనడం సాహసం. భాషమాత్రం ఆంగ్లాంధ్రద్రావిడవంగ ధప్పళం.

ఇట్లు,
రసరాట్.

౨

మందపిల్లి,
౧ - ౧౨ - ౩౮.

రసరాట్టుగారూ! మీపేర వ్రాయడం ఏ ముహూర్తాన్ని ప్రారంభించానో గాని సంగతి తెమిలేటట్టు కనపడదు. మరో

చికొచ్చింది. పోస్తున్న ఒకాయన నే ఉండగానే మాయింటి కొచ్చారు. ఆయనపేరు ఘంటారావుట. ఆయనట తనరచన మానాన్న కిచ్చింది. మీకు నేను పంపినరచన తనదే నని ఆయన పట్టు పడుతున్నాడు. వెనక మీ ఎన్నికల్లో మీ తరఫున పని చేసింది ఈయనేట.

ఇట్లు,
గోపి.

జవాబు

పేరారం,
౨-౧౨-౫౮.

అబ్బాయి, గోపీనాథం! అల్లా చెప్పుమరి! అందుకనే తీవ్రంగా చూసినమీదట ఈ రచన కడుంగడు ప్రౌఢంగా ఉంది. కొన్ని స్ఖాలిత్యా లున్నాయి. ఉంటే ఏంఅన్నాను! కొన్ని స్ఖాలిత్యాలు ఉండాలి అనికూడా నేను వాదిస్తాను. లేకపోతే రచన మానుషమే అనిపించుకోదు. ఇది యథార్థభావాల తోనూ, ఉన్న తాదర్శాలతోనూ నిండి ఉంది. రసం ఇందులో కేవలం ఆవకాయి ఊటలాగ ఊరిపోవడమే కాకుండా సముద్రపు పోటులాగ ఉబ్బి మీద పడిపోతోంది. భాష అతిమధురం. శైలి మనోహరం. పట్టివేళ్లయొక్క చల్ల దనం, పనసంతర్పణపోపుయొక్క ఘుమ ఘుమా, చలిమిడియొక్క పాకం ఏకకాలంలో ఇక్కడ దొరుకుతాయి. వేయేల? ఈ

రచనలోని మాటలు అన్నజిహ్వే జిహ్వ, విన్నచెవే చెవి, తస్కరించనికవే కవి.

ఇట్లు,
రసరాట్.



మందపల్లి,
3 - ౧౨ - ౩౮.

రసరాట్టుగారూ! శాస్త్రం చెప్పిన తరవాయిగా వచ్చింది. ఎప్పటికప్పుడు మీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడం కట్టేద్దాం అనుకుంటూండడం, ఏదో పిల్లసమ్మర్దీ వస్తూండడం జరుగుతోంది. మీరేమన్నా అనుకుంటారేమో అని ఇదవుతున్నాను కుడానూ! ఈవేళ మరోఆయన వచ్చాడు. ఇతగాడిపేరు కేతయ్యట. ఆయనకూడా మానాన్నగారిచేతికి అభిప్రాయం నిమిత్తం తన రచన ఇచ్చాట్ట. మానాన్న ఊళ్ళో లేరని చెప్పేసి మెల్లిగా ఆయన్ని వొదిలించుకున్నాను. ఘంటారావురచనమీద అభిప్రాయం నిన్న మరొకరిదగ్గిర్నించి నాకు వచ్చేసింది. మీదగ్గిరున్న రచన కేతయ్యదే. ఏదో ప్రసంగం వచ్చి, మీకూ తనకీ పచ్చగడ్డేస్తే భగ్గుమంటుందని కేతయ్య అన్నాడు.

ఇట్లు,
గోపి.

జవాబు

పేరారం,
౮-౧౨-౩౮.

గోపీ! ఈసంగతి రాశావు నయమే. ఇంకాదాచుగుని ఊరుకున్నావుకావు, చచ్చిపోయేం. నాకూ అనిపించింది, 'ఏమిరా! కొన్నిలక్షణాలు ప్రశంసార్హంగా కనిపిస్తూఉన్నా, ఈరచన మొత్తంమీద ఏడిసినట్టుందేమిటి' అని. అల్లా అనిపించడానికి కారణం ఇప్పుడు బోధపడ్డది.

ఇంత దరిద్రగొట్టురచన భూమిమీదగాని, అంగారకుడులో గాని లేదు. బుద్ధిగల వాడెవడూ ఇది చివరంటా చదవడు. అందుకనే నే చదవలేదు. ఇందులో, గాఢంగా చూస్తే, అర్థం వ్యర్థం, భావం అభావం, రసం నీరసం, శైలిగాలి, భాష ఘోష, రీతి కోతి, వృత్తి మిత్తి, శయ్య కొయ్య, ధార నార. కొన్నిపట్ల కవి ఏడవబోయాడు. ఆ ఏడుపు ఉచితరీతిగా-అనగా ఏడుపు ఏరీతిగా ఉండాలో అల్లా లేదు. నన్నడిగితే నేనేనా చెబుదును. చాలా చోట్లల్లోకూడా నవ్వు తెప్పించడానికి ప్రయత్నించి రచయిత చచ్చిచెడ్డాడు. నేనెంత బిగపట్టుగుని కూర్చున్నా ప్రాణంమీదికొచ్చిందిగాని నవ్వు రాలేదు. సహజమైన మాటపొందికా సమయస్ఫూర్తీ ఇందులోమృగ్యం. రచననీ, రచయితనీ వేరువేరుగా పుతాలేసినా ఈరచన యింతే. నుడికారం నుశిలోపడింది, కారకం నూరకం చెందింది. నాబోటి గొప్పవాళ్ళనీ కొన్ని గొప్పసంస్థల్నీ నిరసించడం తప్ప

ఇతరం ఏమీ ఇందులో లేదు. ఈరచనలో కొంత-చివరదాకా అసలే చదవలేకపోయాను!- చదివి నేను చాలా పాడైపోయాను. నేకాక తక్కినవాళ్లు చదివితే ఎక్కడ చెడిపోతారో అని బెంగతో తీసుకుంటున్నాను. ఇది ఎవరేనా చదివితే పెద్ద ఒట్టు; జాగ్రత్త!

ఇట్లు,
రసరాట్.

౬

మండపిల్లి,
౫-౧౨-౩౮.

రసరాట్టుగారూ! క్షమించాలి. మానాన్నగారు ఉత్తరం రాశారు. రేపో నేడో ఇక్కడికి వచ్చేస్తార్ట. ఒక పని జరిగిందట. నాలుగైదు రచనలు మానాన్నగారు తమ బోంట్లకి విడివిడిగా అభిప్రాయంకోసం పంపించారట. అందులో ఒకటి శ్రీనాథుడి రచన కూడా ఉందట. కడం అభిప్రాయా లన్నీ వచ్చేశాయి. ఒకవేళ, దిక్కుమాలి ప్రాలుద్ధం, మీకు నే పంపింది అదే కావచ్చు!

ఇట్లు,
గోపి.

జవాబు

పేరారం,
౬-౧౨-౩౮.

గోపీ! అదా కమామీషూ! హారి! చెప్పవేం మరి! అందుకనే, కిందసమాటు నేనెంత ఏకుతూరాసినట్టు ఉన్నా,

అప్పుడు కూడా ఈ రచనలోని ఆ రసస్ఫూర్తీ, ఆపదసౌష్ఠవమూ, ఆ భావవిశేషమూ, ఆ గుత్తపునడకా, ఆ భాషామేళవం, ఆ వగైరాలూ — అవన్నీ తొంగిచూస్తూనే ఉన్నాయి. పెద్దవాళ్ల రచనలు అనేకం ఇతరుల చేతుల్లో పడి పాడైపోయాయి.

ఇట్లు,
ర స రా ట్,

౧౦

మం ద పి ల్లి,
౭ - ౧౨ - ౩౮.

రసరాట్టుగారూ! నాన్నగారు వచ్చారు. మీరు ఏమీ అనుకోకుండా ఉంటే మీకు ఒక సంగతి రాసేసి ఇక్కడితో ఊరుకోమన్నారు. మీ పేర నేను పంపిన రచన ఒక పుష్కరం క్రితం మీరే రచించిందిట. అది మీ రచనలో కల్లా గొప్పదనే అభిప్రాయంకొద్దీ నాన్నగారు స్వహస్తంతో లిఖించి, ఆ కాగితం తనదగ్గిర అట్టేపెట్టుకున్నారట, నేను పంపిన రచన అదే అయి ఉంటుందని చెప్పారు. క్షమించండి.

ఇట్లు,
గో పీ నా థం.

జ వా బు

పే రా రం,
౮ - ౧౨ - ౩౮.

గోపీనాథానికి అనేక ఆశీర్వచనాలు. నేనూ ఊళ్ళో ఈ ఉదయమే వచ్చాను. లోగడ నీకు వచ్చిఉన్న జాబులన్నీ,

నేను ఊళ్లో లేకపోబట్టి మా అమ్మాయి రాసింది. జాబుల్లో ఉన్న వృత్తాంతం యావత్తూ, నువ్వు పంపించిన కాగితాల మీద రాసిఉన్నదే. ఆ రచనా, దస్తూరీకూడా మీనాన్న గారివే. అందులో వారు విమర్శనవాక్యాలురాసి అట్టే పెట్టు కున్నారు, అది పొరపాట్న ఇక్కడికి వచ్చింది. నా రచన అన్నావే! అది కుంభయ్యగారి చేతికి నిచ్చిన మీ నాన్నే యిచ్చారు, జ్ఞాపకం చేసుగోమను. అయితే నీకు పెండ్లి అయిందా?......

ఇట్లు,
ర స రా ట్.

---

# శాస్త్రం - కళ

వాదించినమీాదటగాని ఏవిషయానికీ సారాంశం స్థిరపడదు. వాదన మాటల్లో జరిగితీరాలి. మాటలకి అర్థా లుండాలి. ఉంటూంటాయి. ఒకమాటకి ఒకేస్పష్టార్థం ఉండాలి. కాని సాధారణంగా అల్లా ఉండదు. ఒక్కొక్కప్పుడు ఒకేమాటకి చాలా అర్థాలుంటాయి, లేక ద్రైవాద్వా ఒకేఅర్థంఉన్నా అఒకటీ స్పష్టంగా ఉండదు. ఒకేలాటి అర్థంతో చాలామాట లుంటాయి. అటువంటిమాటల్లో వాదన్లు జరిపినన్నాళ్లు, పర్యవసానం మస్తుఆటలా ఉంటుంది. అందుకని అధమం వాదప్రతివాదంచేసే జనమేనా, తమరు మిక్కిలి తరుచుగా వాడకంచెయ్యవలిసోచ్చే ముఖ్యపదాలకి, ఇటువంటి ఇటువంటి స్పష్టార్థం పుచ్చుకుందాం, లేకపోతే ఆరోపించుకుందాం, అనీ ముందు ఒడంబడిక చేసుగున్నమీాదటగాని వాదన చెయ్యనేకూడదు. పదం చిన్న చిన్న ద్రైనకొద్దీ దాన్ని నిర్వచించడానికి, అనగా ఇతరమాటలు లేవదీసి వాటిపరిహద్దులమధ్య దాని అర్థం యావత్తూ ఇమిడేటట్టు చెయ్యడానికి చిక్కులు ఎక్కువైపోతూంటాయి. ఎంచేతంటే అందులో మళ్లీ మాట లుంటాయి. ఒకొక్కప్పుడు ఒకపదాన్ని నిర్వచించకపూర్వమే నయం, కొంతేనా తెలిసిన ట్టుంటుంది. నిర్వచనం చేసినతరవాత లోగడ మనికి తెలిసినట్టున్న ఆకాస్తాగుడా ఏష్యం అయి చక్కాపోతుంది.

సాధారణంగా సులభపదాన్ని నిర్వచనంచేసేటప్పుడు - ఆమాట రాకూడదాయిరిగనక — కొన్ని కఠినపదాలు వచ్చి తీర తాయిగనక. అంచేత, అటువంటిపదాల నిర్వచనం తలపెట్టు గోకపోడమే ఉత్తమం. పోనీ అందు బాపైన పదాలకేనా నిర్వచనం ఉండితీరాలి. లేకపోతే భావానికి సమగ్రత ఉండదు, ఆలోచనకి అభివృద్ధి ఉండదు, భావనకి నమ్మకమైన విచారణ స్థలం ఉండదు. 'శాస్త్రం' 'కళ' అనే రెండుమాటలూ అల్లాంటివే. ఈ రెండింటికీ ఏమీ తేడా లేదనినీ్న, ఒక వేళ ఏమాత్ర మేనా ఉన్నా "ఉండ!" అని పట్టటడం ఆంధ్రధర్మం కాదనినీ్న. అది ఇంగ్లీషులు నేర్పడంవల్ల తత్సంప్రదాయాన్ని అనుస రించి పుట్టిన విపరీతజ్ఞానమనినీ్న — పట్టినవెఱ్ఱి అనినీ్న — కొం దరిమతం. వాట్లభావాల్లో తేడాలున్నట్టున్నూ, వేర్వేరుఅర్థాలు సూచించడం నిమిత్తమే అవి పుట్టినట్టున్నూ కొందరు తలు స్తారు. ప్రస్తుతం వాటినిర్వచనం ప్రయత్నించి, వాట్ల ప్రత్యేక లక్షణాలు కేటాయించి, అవి తిన్నగా గమనించి చూసుగో పోడంలో ఉండే తగాయిదాలు చూసి వాటిఅవసరాలు గమనించుదాం.

మరొక్కసంగతికూడా ముందే అనడం కొంచెం అవసరం. ఈరచనలో ఉన్నది చాలావరకు పాతది. శబ్దరూపంగూడా ఇతరులదే అయినప్పుడు ఆయా అభిప్రాయాలు కేటాయించి గుర్తించాను. తక్కిన, నా అభిప్రాయాలు అని నేననుకునేవి కూడా ఇంతకంటె రసవత్తరంగా ఎక్కడో ఈవరకే రూపం

దాల్చి ఉండవచ్చు. ఆమూలాలన్నీ వెతికి చూసుకోజాలక పోయిన నా అజ్ఞానాన్ని పండితులు సైరించాలి; "అపూర్వకల్పనాశక్తి చాలవరకు ఎల్లప్పుడూ ససంబంధమే" కదా! అదీకాక పాతలెఖ్ఖప్రకారం, శాస్త్రాలు ఆరు, కళలు అరవైనాలుగూ, ఉన్నాయి. ఎన్నెన్ని ఏరీతిగా గమనించీ, లక్షణాలు కేటాయించడం? అని అడిగినా నాకు సమాధానం లేదు. "అసలు జ్ఞాని మాట్లాడ్డు, రచించడు, ఏమీ చెయ్యడు! రచనలు రచయిత స్వాంతానికి జ్ఞానార్జనచేసుకునేటప్పుడు పడేతంటాలు. అందువల్ల అవి అజ్ఞానాన్ని వెల్లడిస్తాయిగాని. జ్ఞానాన్ని కావు" అని ఒకసాహసుడు అన్నాడు. ఆయన అన్నట్టు తెలుపుడు చెయ్యడానికి ఎల్లాగో, అల్లాగే తెలుసుకోవలిసిన పనున్నప్పుడు కూడా రచన తప్పదు. ఈరచనకి నెపంఅంతే.

జ్ఞాను లన్నదాన్నిబట్టి: బుద్ధి ప్రయోగించి ప్రకృతినీ, మానవుణ్ణీ, ప్రకృతిసంభవాల్నీ, మానవకల్పితప్రయోగాల్నీ జాగ్రత్తగా గమనించి, మననంచేసి, అనుభవానికి వచ్చినసంగతులు సేకరించి, వాటినిపౌర్వాపర్యప్రకారం పేర్చి, పరిశోధించి, పరీక్షించి, తేర్చి, తీర్చి, భావనాశక్తి సాహాయ్యంవల్ల వాటిల్లో — మణిహారంలో సూత్రంలాగ — ఉన్నజ్ఞానాన్ని గ్రహించి, ప్రసాద శయ్యాది లక్షణాలుగల స్పష్టపదాలలో సిద్ధాంతంచేసి, సూత్రించి, అమర్చిఉంచితే అప్పుడు ఏర్పడేది శాస్త్రము.

ఇక, కళ: "ముందు తాను పూర్తిగా అనుభవించి లీనమై పోయిన తన చిత్తవృత్తుల్ని, బుద్ధిపూర్వకంగా కొన్నికొన్ని

బాహ్యచిహ్నలద్వారా [—చలనములతోనో: అది, నాట్యం; — గీతలతోనో: అది, చిత్రలేఖనం; — రాళ్లతోనో: అది, శిల్పం; — రంగులతోనో: అది, చిత్రరచన; — స్వరములతోనో: అది, గానం; — పదములతోనో: అది, కవిత్వం] ప్రకటించి, ఆచిత్తవృత్తుల్ని ఇతరమానవుల హృదయాలకి పాకించి, వాళ్ల చేత తనచిత్తవృత్తులవంటివి అనుభవింపచెయ్యడానికి ఒకమానవుడు చూపెట్టే పనివాడితనం — సృజించినకృతి — కళ" అని.

వీటినే కొంచెం విడగొట్టి, కొంచెంవాఖ్యానంచేసి చూస్తే, వీటిల్లోఉండే లక్షణాలూ వాటి భేదాలూ గోచరిస్తాయి.

శాస్త్రం, తర్కవితర్కాలతో ఆరిందాగా చెప్పి ఉన్న పలువుర అనుభవజ్ఞానసారమైన కబుర్లు — కళ, అలంకార శోభతో ఒప్పుతూండే ఒక్కడిస్వానుభవంతో కూడినపని. శాస్త్రంలో పదాలు అర్థాలతోటీ, పరమార్థాలతోటీ, సంగతుల తోటీ వృత్తాంతాలతోటీ, నిండిఉండి గ్రాహకుడి బుద్ధికిబోధపడి దాన్ని వికసింపచేస్తాయి. కళలోని సాధనాలు అర్థాన్ని దాటి భావాన్నిదాటి రసమయమై. హృదయానికి ఆనందం కలిగి. స్తాయి. శాస్త్రం కేవలకృషికి సుసాధ్యంకాకపోయినా దుస్సాధ్యం అని అనిపించదు—కళ కేవల కృషికాక, మనం చెప్పుకోలేనిదేదో ఉంటేగాని, అసాధ్యం అనిపిస్తుంది. శాస్త్రం పూర్వప్రమేయం గనక అక్కడధారణ ఉపచరిస్తుంది — కళలోభావన కణకణలాడుతుంది. శాస్త్రంయొక్క అపారత్వ గభీరత్వాలు దాన్ని అపౌరుషేయం అనిపిస్తాయి — కళ, కేవలదైవికం

అని తోపిస్తుంది. శాస్త్రం బోధనీయం — కళ నేర్చతగ్గదేగాని నేర్పవీలైంది కాదు. సత్యమే శాస్త్రానికి గమ్యస్థానం (—అదీ శుద్ధంకాదు, నిత్యంకాదు!) — ఆనందమే కళకి గమ్యస్థానం (అది శుద్ధం, నిత్యం!). శాస్త్రంపరిభాషతో నిండిఉండి, అది నేర్చిన వాళ్లనిగాని జేర్చుకోదు — కళలో పరిభాష అల్పతమంగా ఉండ డంవల్లనున్నూ, ప్రవేశం ఏకాంతో ప్రతీవాడికీ ఉండడంవల్ల నున్నూ, అందర్నీ చేర్చుగోడానికి ప్రయత్నిస్తుంది. శాస్త్ర లక్షణం ఔన్నత్యం, కళాలక్షణం వైశాల్యం. మానవుడు శ్రద్ధతో శాస్త్రంగురించి వెళ్లాలి—కళ దానంతట అదే మానవుణ్ణి తనకేసి ఆకర్షించుకుంటుంది. శాస్త్రంలో ఏ ఒక్కమనిషియొక్క ప్రత్యేక లక్షణాలూ కనిపించక, అదంతా యంత్రవతు అయిపోతుంది — కళాకారుడు కృతిలో ప్రతిఫలిస్తూ ఉంటాడు. శాస్త్రంలో ప్రసాదం ప్రధానం — కళలో ధ్వనిప్రధానం. శాస్త్రం భయం పుట్టిస్తుంది — కళ ఆంతర్యపరిచయం కలిగిస్తుంది. శాస్త్రం నిర్బం ధించి నమస్కారం కోరుతుంది — కళ మనఃపూర్వకమైన ఆత్మా ర్పణ పొందుతుంది. శాస్త్రంలో విచక్షణా, కారణం, విచా రణా, ముఖ్యం—కళలో భావన, ఫలితం, క్రియ, ముఖ్యం. శాస్త్రం జ్ఞానభాగాల్ని పుచ్చుగుని, ముక్కముక్కలు చేసి మూ లానికెళ్లి, సకారణంగా వీలైనంతవరకు సూత్రిస్తుంది. అందుకని శాస్త్రంలో విడగొట్టడం ఉంది. — కళ అక్కడా అక్కడా పడిఉండేముక్కలన్నింటినీ ఒకచోటికిజేర్చి, చిత్రప్రకారంవాటిని పేర్చి, ఆ సాంగత్యంతో మనస్సుని హరిస్తుంది. అందుకని కళలో

కూడిక ఉంది. శాస్త్రం ఎప్పటికప్పుడు అసంపూర్ణమే; కళ ఎప్పటికప్పుడు సమగ్రమే. శాస్త్రం కట్టె – కళ ప్రాణం. 'శాస్త్రం ఊపిరితిత్తి – కళ హృదయం.' శాస్త్రం సాధనం – కళ సాధ్యం

కాబట్టి, శాస్త్రం – కళ అని మనం వాడుతూండే సందర్భాలు వేరు వేరని నిరూపించుకోవచ్చు. ఇవి ఫలానా శాస్త్రాలూ ఇవి ఫలానా కళలూ అని అనేసి ఊరుకోనే అక్కర్లేదు. ఏవిషయంలోనైనా సరే, జ్ఞానభాగాన్ని శాస్త్రం అనీ, ఆచరణవల్ల పుట్టే క్రియని కళ అనీ అనచ్చు. పాకవిషయంలో పాకశాస్త్రం వేరు, పాకకళ వేరు. గాన విషయంలో, గానశాస్త్రంవేరు, గానకళవేరు. పదరచనవిషయంలో ఛందశ్శాస్త్రం వేరు, కవిత్వం వేరు. తక్కిన అన్నివిషయాల్లోనూ అంతే. శైలి నడిచే శాస్త్రం వేరు, శైలి నడపడం వేరు. ఏదైనా శాస్త్రంలో కూడా ఆచరణభాగం కళ; ఏదేనా కళలోకూడా జ్ఞానభాగం శాస్త్రం. ఒకవిషయంలో – మాటవరసకి గానంలో – ఎవరికేనా అమితమైన శాస్త్రం తెలిసిఉండవచ్చు, వారిదగ్గర గానకళ లేకపోవచ్చు. గాన క్రియమాత్రమే అనుభవింపగల అనేకులు వారిని మెచ్చలేకపోగా, శాస్త్రజ్ఞులు ఒకరిద్దరు వారిని బ్రహ్మరథం పట్టవచ్చు. మరొకరిదగ్గిర గానకళ ఉండి, గాన శాస్త్రం దొరకకపోవచ్చు. వాళ్ళు జనాదరణ పొందినా శాస్త్రప్రియులు వాళ్లని తీసిపారేస్తూనే ఉంటారు. ఒకప్రదేశంలో మానవులు ఒక నూతనవిషయం పరిశోధించడం ప్రారంభిస్తే, అది లోకానికి ఎందుకేనా కావలిసింది అయితే, కాలక్రమాన్ని అది ఒక

శాస్త్రం అవుతుంది. ఆరీతిగా చూస్తే శాస్త్రాలు అనంతం. పైగా ప్రతీశాస్త్రం ఎప్పటికప్పుడు అసంపూర్తి. అప్రకారంగానే మానవులకి అవసరం అయిన పనులన్నీ కళలే, అవీ అనంతమే. కాని మానవచిత్తవృత్తుల్లో ప్రమేయం ఉన్నవాటినే సార్థకంగా కళలనీ – లలితకళలనీ – అంటారు. అయితే శాస్త్రాలన్నీ – ప్రభావంలో అయితేం! – మాటల్లో ఉండితీరాలి. మాటలలో ఉండగల లలితకళ కవిత్వం. అందువల్ల ఆదిని శాస్త్రాలన్నీ (వైద్య, జ్యోతిష, వ్యాకరణ, నిఘంటువగైరాలు) పద్యరూపంలోనే పడిపోయి శాస్త్రకళలు కలిసిపోయి ఉన్నాయి.

పై నిర్వచనాలు ప్రయోగించి చాలా సంగతులు చూడవచ్చును. రెండు మూడుచూద్దాం. శాస్త్రం బోధనీయంగనక గురువూ శిష్యుడు ఉండగలరు. కళ అనేదాన్లో గురువూ శిష్యుడూ ఉందాం అని బయల్దేరినా. ఆట్టేకాలం ఉండరు. కవిత్వంలో అంతే. గురువు చెప్పిన ఛందస్సులోటి శిష్యుడు పద్యం రాయడం, అది గురువుగారు రాయలేకపోడం, రాసినా నాసిరకం అవడం, శిష్యుడు గొప్పవాడవుతున్నాడని గురువుకి ఈర్ష్య బయల్దేరడం, గురుధిక్కారం వగైరా వగైరాలు. గాయకులవద్దిర శిష్యులు చేరడం, ఆట్టే శాస్త్రం చెప్పినా తమర్ని మించిపోతారని వాళ్ళకి ఆట్టే చెప్పకపోడం, దాంతోటే వాళ్ళెళ్లి సభల్ని రంజింపచెయ్యడం, తద్వారా కోపాలు వగైరాలు. ఇల్లాగే, కళ ఒక వ్యక్తియొక్క ప్రతిభని ప్రకటించేది అవడంవల్ల అనుకరణానికి కుదరదు. అందుకనే అనుకరణం

హాస్యాస్పదం, పైగా పదిమంది జట్టుకట్టి ఒకతేమాదిరి రచన ప్రారంభిస్తే, నిలిస్తే ఒకడు నిలిచి తక్కినవాళ్ళు బలి అయి పోతారు. ఆ పదిమందీ పంచుగుని ఒకరు చెయ్యానికి ఒకరు చేశారా తగాదా లేదు, పైపెచ్చు అది శ్లాఘ్యం. శాస్త్రంలో సంగతులూ వృత్తాంతాలూ ఉంటాయి గనక, ఏదో ప్రమాణాం కుదుర్చుగుని పోటీలుపెట్టవచ్చు. కళ కృతిగనక దానికి విలవగట్టే ప్రమాణం ఉండదు. కాలమే కళని కొలిచేది. అందువల్ల గాన కళ, ఉపన్యాసకళ వచనరచనాకళ నాట్యకళల్లోనూ పోటీలు జరిపి తరతమభావం నిర్ణయించడం అసాధ్యం. ఒకవేళ సుసా ధ్యం కాకపోతుందా అని, అఖండవ్యక్తులు బయల్దేరి నిర్ణయాలు చేసినా వాటిల్లో న్యాయం దొరకదు. వ్యక్తుల అభిప్రాయాలు కళా నిర్ధారణ చెయ్యలేవు. అందుకని పక్షపాత అభిమానా ల్లోనేగాని ఈ నిర్ణయాలు జరగవు. నిర్ణయకర్తల తీర్పు చాలా అసంతృప్తిగా ఉంటుంది. కొందరు చివరికి మెచ్చేది ఆయా శాస్త్రమేగాని అందులో బయల్దేర వలసినకళ గాదు. కొన్ని పోటీలు విచారణచెయ్యగా; వేషధారణపు పోటీల్లో కబుర్లు చెప్పి నవ్వించినవాడికీ, నాట్యంపోటీలో పాడినవాడికీ, ఉపన్యా సపుపోటీలో బల్ల గుద్దలుకొట్టినవాడికీ, వచనరచనపోటీలో వ్యాకరణం పాటించినవాడికీ, గానంపోటీలో పీక మంచివాడికీ లేక సరిగమలు మాట్లాడిన వాడికీ బహుమతులు రావడం ఎరుగుదుం. "ఏదో ప్రోత్సాహం ఇవ్వడానికి ఏదో ఓటి చేశాం పోనిస్తూ హా!" అంటారు కొన్నిచోట్ల. ఏదో ఓటి

చెయ్యొచ్చుగాని అన్యాయం చెయ్యకూడదు. మరొక్క విషయం: ముఖ్యంగా సభ ఏర్పడ్డప్పుడు, అనగా అనేక వయస్సుల, వర్ణాల, సంస్కారాల, సంప్రదాయాల స్త్రీపురుషులు ఒకేసమావేశంలో ఉన్నప్పుడు శాస్త్ర - కళల సంబంధం - (విభేదం) గమనించాలి. ఓ గానసభ ఉందనుకోండి: గానశాస్త్రమే తెలిసి, గానకళ చేతగాని తను పుస్తకాలు రాయడమో గానంగురించి, ఉపన్యసించడమో, గానపాఠంచెప్పడమో, చెయ్యడం మంచిది. అంతేగాని అన్నివర్ణాల అందరూ వచ్చికూర్చున్న సభలో తనకు వచ్చినగానశాస్త్ర పాఠాలన్నీ క్రమంతప్పకుండా సభవారిమీద వర్షించి ఆ గాన శాస్త్రమే గానకళ అనుకుని సభవారు మొత్తంమీద మూఢులున్నూ (మళ్ళీ గానాన్ని 'పశుర్వేత్తి' అంటారు) తనమాత్రం జ్ఞానిన్నీ అవడంచేత వారు తనగానాన్ని మెచ్చుగోలేకపోతున్నారని సమర్థించుకుని ఇద్దరో ముగ్గురో సభ్యులు గానశాస్త్ర గానకళలభేదం తనికి మల్లేనే గమనించనివాళ్ళు బాగుండదని చెప్పి - 'ఓహో' అంటూండడం తనికి చాలని మురిసి సభలో గానశాస్త్రం వర్షించేవారున్నారు.

ఇది గానవిషయంలో చెల్లిపోతోంది: ఎంచేతంటే ఎంతమనోహరమైన నాదానికీ అర్థము తెలియదు. నాదచిహ్నాలైన స, రి, గ, మ లకీ అర్థం తెలియదు, ఉపాధిగా ఉండడానికి తేబడే సాహిత్యానికీ అర్థం తెలియదు. కాని గానంకాక ఇతరవిషయాలైతే ఈసంగతి హాస్యాస్పదం అని తేలుతుంది.

పదరచన విషయంలో కవిత్వకళ చేస్తానని సభ మొదటి కొచ్చి ఛందశ్శాస్త్రం అప్పగించినా నాటకకళ చెయ్యడానికి సభమొద టికి వచ్చి నాట్యశాస్త్రం ఏకరువుపెట్టినా, భోజనానికి బారులు తీర్చి కూర్చున్న జనం ఎదట పాకం వడ్డించడానికి వచ్చినవాడు తను ఏయే సాధనసామగ్రి ఏయే విధంగా వాడితే పాకం అవుతుందో ఆశాస్త్రం తన కెంత వచ్చునో చెబుతూ కూర్చున్నా, ఆయా కవితాసభవారికీ, నాటకసభవారికీ, భోజనసభవారికీ, చాలా చిరాకుగాఉండి జనంలేచిపోతారు; ఎంచేతంటే వీటిల్లో పదార్థాలు కేటాయించి, ఇది విధానం (శాస్త్రం)- ఇది దానివల్ల నెరవేర్చిన క్రియ (కళ) అని తేల్చడానికి ఎక్కువ వీలుండబట్టి. అందుకని గానవిషయంలో శాస్త్ర కళల కేటాయింపు చాలా అవసరం.

శాస్త్రం: "బుద్ధివికాసనసిద్ధికి సక్రమ మార్గం చూపిస్తుంది. ఐహికాముష్మిక సౌకర్యాలకి తోడ్పడుతుంది. అభయం చేకూ రుస్తుంది. సంఘసమస్యలు పరిష్కరించడానికి పనికొస్తుంది. మానవుల అల్పత్వం మానవులకి ఎప్పటి కప్పుడు జ్ఞాపకం చేస్తుంది."

కళ: లోకప్రీత్యర్థం శాశ్వతత్వందాల్చే కర్మ మానవుడు చెయ్యగలడని చెబుతుంది. లక్షలోట్లుగల మానవుడిలో ఉండి. సఫలమైన దివ్యాంశని ప్రకటిస్తుంది. ఒకేక్షణంలో అనేకుల్ని రంజింపజేసి, జనాన్ని ఐక్యంచేస్తుంది. సకలమానవ సమత్వం చేకూరుస్తుంది.

---

# 'రెండో భాష' మేష్టరు

"తెల్లవాళ్ళ స్కూళ్ళలో తెలుగు పద్యాలమీద ఖాతరీ లేదండి" అన్న గిరీశంమాటల్లోనూ, "తెలుగు క్లాసటన్న తేలికగా చూచు టాంగ్ల పాఠశాలలందు గలదు ..." అనిన్నీ, "ఆంగ్ల పాఠశాల యందు దెలుగు పంతులుగ జేరుటన్న దొలిభవంపు పాపము" అనిన్నీ ఉన్న చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి మాటల్లోనూ వచ్చే 'తెల్ల', 'ఆంగ్ల' పాఠశాలలంటే తెలుగుదేశంలో ఉండే ఇంగ్లీషుబళ్ళు అనే అభిప్రాయం. కవి పండితులేకాక పామరులుకూడా దీన్నిగురించి తత్తుల్యంగానే సెలవిస్తూంటారు. తెలుగునాట ఇంగ్లీషుబళ్లలో చదువుకున్నవాళ్ళు ప్రసంగాలు చేసుగునేటప్పుడు విషయం దొర్లిదొర్లి తమ చిన్నప్పటి తెలుగుమేష్టరుమీదికి వెళతూంటుంది. ఒకడంటాడు: "మాకు ఓ తెలుగుమేష్టరుండేవాడు. బహు తమాషా మనిషి. మహా మంచివాడు. అఖండ పండితుడు. క్లాసులో కూడా చిన్న రాగిచెంబు ఆయనచేతులో ఉండేది. ఎవరితో నేనా కాస్త మాట్లాడగానే ఆచమనం చేసేవాడు. మునీలి పండులా ఉండేవాడు. మేం 'తాత' గారు అని ఆయన్ని పిల్చేవాళ్ళం. భాష తల్లి గనక, ఆ తల్లికి తండ్రి అవడంచేతగావును ఆ వరస — అని ఇప్పుడు బోధపడుతోంది. బతికున్నవాడిరచన యేదీ ఆయన మెచ్చేవాడు కాడు. తనని యేమన్నా రాయమంటే, — మన కేం వచ్చురా మనమొహం! ఆ పూర్వులవి

లక్షలూ కోట్లూ ఉన్నాయి, అవి వల్లించి జీర్ణించుగుని హృద్గతం చేసుగుంటే చాలదుట్రా, నెలతక్కువగ్రంథాలు షేం పుట్టించాం అంటూ గంతు లెయ్యకపోతేనూ! – అనేవాడు. ఆయన సంస్కృతాంధ్రాల్లో మాత్రమే ఉద్దండుడవడం వల్ల, ఆయన్ని మేం హోరున ఏడిపించుగు తినేవాళ్ళం'' అని, చిన్న తనప్పు విషయాల్లో సాక్ష్యం కష్టం గనక తనకే విజయం ఉండేసినట్టు నీలిగి నవ్వుతాడు. మరోడు విషయం దొరక పుచ్చుగుని, "మా తెలుగుమేష్టరుండేవాడు. మహాగడుగ్గాయి గానూ, చాలా పెడసరంగానూ ఉండేవాడు. మాట్టాడ్డం ఆయన మొదలెట్టేసరికి ఫుల్లవిరిచి పొయిలో పెట్టినట్టుండేది. కర్మ దశ, ఆయన స్వయంకృషివల్ల ఇంగ్లీషు నేర్చాడు. ఆగర్వంతో మమ్మల్ని నోరెత్తనిచ్చేవాడు కాడు. పైగా, అడ్డమైనప్పుడూ శ్లేషల్తో మాట్టాడి మాకు అసహ్యం కలిగేటట్టు తనప్రజ్ఞలూ పైత్యాలూ కనపరిచి, చిన్నకుర్రాళ్ళని చేసి మమ్మల్ని నెగ్గుకుపోతూండేవాడు. ఆ అసహ్యం నామనస్సులో పేరుకుని నిల్చిపోయి తరవాత తరవాత ఆయన ఎదరపడ్డప్పుడు నేను ఆయనకి దణ్ణమేనా పెట్టనీకుండా చేసేసింది. తను వెనక తిన్నగా ప్రవర్తించిఉంటే నేను తరవాతేనా తన్ని గౌరవించి ఓ దణ్ణం పారేస్తూండేవాణ్ణేగా! తలపొసురు కనపరిచి నిక్షేపం లాంటి నా దణ్ణం చెడగొట్టుకున్నాడు! ప్రాప్తంఉండద్దూ!'' అంటూ తన ఔదార్యం వెళ్ళబుచ్చుతాడు. ఇటువంటి యోగ్యతా నిర్ణయవాక్యాల్ని బట్టి చూస్తే, బొత్తిగా ఇంగ్లీషుముక్కలేనా

తెలియకుండా ఉండి అవి నేర్చడానికి ఉసూరుమంటూ యత్నించే విద్యార్థులకిహాస్యం కల్పించినవాడు తెలుగుమేష్ట ర్లలో క్షంతవ్యుడనిన్నీ, అటువంటి ముక్కలే ఓబుళ్లైడో తక్లైడో తనూ పోగుచేసుగుని గడుసుగా మేష్టరీ నిలబెట్టుగో డంలో నెగ్గిన తెలుగుమేష్టరు గర్విష్ఠి అనిన్నీ ఊహలు మొదట తెలుగువిద్యార్థుల్లోనూ, అందువల్ల కొద్దికాలం తరవాత తెలుగువాళ్ళల్లోనూ వ్యాపించి, వ్యాపించుతూ ఉండడం అనేది సత్యదూరం కాదు. అటువంటి తెలుగు మేష్టరీయొక్క స్థితీ, ఆ స్థితి సుసాధ్యం అయేలాగు చేసిన వాటాదార్లు ఒకరికి తెలియకుండా ఒకరు పడ్డ శ్రమలూ గమనించడమే ఈ రచన ఉద్దేశం. స్కూళ్ళల్లో ఇంగ్లీషుభాషాపాఠం తప్ప కడమపాఠా లన్నీ తెలుగులోనే కానిచ్చితీరాలనే ఈరోజుల్లోకూడా, "రెండో భాష' అనే బిరుదం పోగొట్టుకోడానికి శక్తి లేకుండా ఉన్న 'తెలుగు' యొక్క యథార్థస్థితి గురించి ముచ్చటించే టప్పుడు, నవ్వొచ్చినా ఆగదు, ఏడుపొచ్చినా తప్పదు.

"అసలుకోతి, అందులో కల్లు తాగింది, ఆపైని తేలు కుట్టింది, దరిమిలాను దెయ్యంపట్టింది, పైగా ఎన్నికలకి అభ్యర్థిగా నిల్చింది." అంటూ కొందరు సామ్యం పారేస్తుంటారు. అల్లాగ్గానే, అసలు మేష్టరు, అందులో తెలుగుమేష్టరు, ఆపైని ఇంగ్లీషుబళ్లో తెలుగుమేష్టరు, దరిమిలాని తెలుగువాళ్ళ ఇంగ్లీషుబళ్లో తెలుగుమేష్టరు, పైగా పోటీలు! ఓ! ఎల్లా ఉండవలసునో అల్లా ఉంటుంది. ఇంగ్లీషుబడి అంటే విస్తారం

ఇంగ్లీషు వాళ్లాడిపోయే ఒకే అన్నమాట. అందులో ఫక్తు ఇంగ్లీషుభాషాపాఠం మాత్రమే ఇంగ్లీషులో కానిచ్చి ఊరుకో కుండా, చాలాభాగం శాస్త్రపాఠాలుకూడా తెలుగుపిల్లలకి ఇంగ్లీషుభాషలోనే బోధించేచోటు — అనగా ఒక శాస్త్రం అభ్యసించాలంటే దాని తాలూకు పరిభాషకూడా పరభాష లోనే ప్రతీ తెలుగుకుర్రాడూ తెలుగువాడైన మేష్టరువల్ల నేర్చుగునే చోటు. పఠనీయ విషయాల్లో తెలుగు ఒకటి. అటువంటి తెలుగులో విద్యార్థుల్ని ఉత్తీర్ణుల్ని చెయ్యడానికి ఆసామీ ఉండాలి. ఆయన్ని తెలుగు శాస్త్రుల్లు, తెలుగు పండిట్, తెలుగు మున్షి, తెలుగుపంతులు, తెలుగుమేష్టరు అని విద్యార్థులుకానివా ళ్ళంటారు. విద్యార్థులు తమ సహజ చమ త్కారం దానంచేసి సాధారణంగా ప్రతీ పండిట్‌నీ ఒక ముద్దు పేరుతో వాడుతూంటారు. అలాంటి తెలుగు దేశపుఇంగ్లీషు బళ్లో తెలుగుమేష్టరుగా ఉన్న జీవుడు — పానకంలో పుడక కంటె అడ్డు; తోటకూరకాడలో పురుగుకంటె తీసికట్టు; గొప్పయింటి కెక్కిన సవితి కూతురుకంటె అసహ్యం; మనువర్తి లేని వెధవ ఆడుపడుచుకంటె కనిష్ఠం; శ్రీరామనవమి హరిదాసుకంటె అన్యాయం; గానం కురుపించని ఆంధ్రనటుడి కంటె అధమం; ఎన్నికల్లో ఎగబడే బ్రాహ్మణ అభ్యర్థికంటె కిందిచెయ్యి; ఇల్లటపల్లుడికంటె తేలిక; ఇంగ్లీషు చదువుకోని పెళ్ళికూతురుకంటె తక్కువ; తీర్థాల్లో నులకమంచం మిఠాయి కంటె చవక; పంచముడు జొరబడ్డ దేవాలయం కంటె

అపవిత్రం; నిజం వాదించే ప్లీడరుకంటె నాశిరకం; ఎన్నికల్లో ఓడిపోయి తరవాత 'నామినేటు' కాబడ్డ అభ్యర్థికంటె లొంగసాను; తద్దినం పెట్టేవాడి తమ్ముడి కంటె అనవసరం; ఉమ్మడి ఆస్తికంటె బంజరు; ఆంధ్రసంస్థకంటె మూరాముళ్ళు; లైసెన్సు లేని డ్రైవరు కంటె అభాంద్రా; రాజీనామా దాఖలుచేసి వెళ్ళి పోయిన ఉద్యోగస్థుడిస్థానే వచ్చిన అయ్యకంటె హాస్యాస్పదం; పిలవని భోజనానికి వెళ్ళిన వ్యక్తికంటె తరవాతమాట; చటుక్కున కళ్ళనీళ్ళు పెట్టుగోలేని ఆడదానికంటె వెర్రిమనిషి; అజ్ఞాత వాసం చేస్తూండే డ్రైనింగు స్వరూపంకంటె ఇది; బిళ్ళ అంటించని ఉత్తరంకంటె చచ్చు; పాలలోబల్లి, నీళ్ళలోరాత, గాలిలో చేప!

ఇంగ్లీషుబళ్లో తెలుగుమేష్టర్ని — హెడ్డుమేష్టరు కసురుగోవచ్చు; కాని 'తల' గలవాడు అట్లా చెయ్యడు. అదృష్టంవల్ల తెలుగురాని ఇతర మేష్టర్లు చప్పరించి పారెయ్యొచ్చు; కాని, పరమార్థం గుర్తించిన ఇతరుడు అట్లా చెయ్యడు. జ్ఞాతిపండితుడు డీకొనవచ్చు; కాని, అప్పుడు తిట్లే కాని దెబ్బలుండవ్; పిల్లలు హాలో లక్ష్మణా అని పాడించవచ్చు; కాని, అది వ్యక్తి యొక్క గాత్రాన్ని బట్టి పిరాయిస్తుంది. భంట్రోతులు వినిపించుగో పోవచ్చు; కాని, వినుపించుగున్నవాళ్ళకీ చెయ్యక పోవచ్చు గనక ఆ విషయం నష్టం ఉండదు. సరే సరి పెద్ద ఇనస్పెక్టరు మొహామే చూపించకపోవచ్చు; ఓమోస్తరు ఇనస్పెక్టరు గదమాయించవచ్చు; మరీ మైనరు ఇన్స్పెక్టరుకూడా ఏదో

యథాశక్తి కోడంటికం పెట్టకుండా ఊరుకోకపోవచ్చు — అందరికీ విడివిడిగా తెలుగూ కలిపి సంస్కృతమూ తెలియకపోవు. గాక, అది వేరుసంగతి!! ఒకచోట ఇనస్పెక్షన్ అంతా పూర్తి కావచ్చిన సమయంలో ఇక ఏమేమిటి మిగిలి పోయాయో ఇనస్పెక్టరు లెఖ్ఖచూసి తెలుగు కాంపొజిషన్ బుక్కులు చూసిఉండలేదని తేల్చి, తను తన బసకి వేంచేస్తూ, కాంపోజిషన్ పుస్తకాలకట్ట పట్టుగుని తెలుగుమేష్టర్ని తనబసకి రాత్రి రమ్మన్నాడు! మొత్తం మీద చెప్తే, ఇంగ్లీషుబళ్ళలో ఉండే విద్యలతో బాదరాయణసంబంధం ఏదో వోటి కలిగిఉన్న అడ్డమైన జనానికీ, తెలుగుమేష్ట రంటే — "విద్యా విషయాల ప్రణాళికలో 'రెండోభాష' అనే నామధేయంతో ఉన్న 'తెలుగు' యొక్క పూచీ నెత్తిమీద వేసుగుని, కాళ్ళు పట్టుగుని ఈడ్చి పారేస్తూన్నా చూరుపట్టుగుని వేళ్ళాడుతూ, ప్రస్తుత ప్రపంచంతో ఈషణ్మాత్రమైనా సంపర్కం లేనటువంటిన్నీ, తనికీ మరి తనలాంటి ఇద్దరికో ముగ్గురికోమాత్రం తెలిసినటువంటిన్నీ ఒకానొక పాండిత్యం దేవభాషలో ఎందుకో ఎల్లాగో ఎంతవరకో కలిగి ఉండి, తద్వారా సంక్రమించిన త్రిదశత్వాన్ని నిలబెట్టుకో గలందులకు నెలకు ముప్ఫైరూపాయల పరమావధి జీతం లాగుతూఉండే పరమ నెంబరు వన్" అనే సంకల్పం ఉన్నట్టు సూచన్లవల్ల కనిపిస్తుంది.

ఇంగ్లీషుబళ్లో తెలుగుపాఠంవేళ అయేసరికి విద్యార్థికి ఎక్కడలేని ముచ్చటా, ఎక్కడలేని హుషారీ, ఎక్కడలేని సరదా,

ఎక్కడలేని స్వేచ్ఛానూ! కడంపాఠాలు చాలాభాగం ఇంగ్లీషు భాషలోనే జరిగిపోతూండేవి. ఇటీవలి ప్రభుత్వపు నిర్బంధంవల్ల వాచా ఇతర పాఠాలుకూడా తెలుగులో మొదలెట్ట యత్నించినా, మనసా ఇంగ్లీషులోనే వెళ్ళబుచ్చుకుంటున్నారు. కొందరు త్రిశంకుస్వర్గంలో పడుతున్నారు. ఇంగ్లీషుభాష తెలుగువాడికి పరభాష. కాబట్టి ఇంగ్లీషుపాఠంలో మేష్టరు వాడుతూండే సంప్రదాయాల్లో చాలావరకు తనికి అగమ్యంఅయినా, విద్యార్థి తెలుసుకోక తెలియనిసంగతి ముఖలక్షణాల్లో కించిత్తూ పొక్కనియ్యక వింటూ, వీలైతే నీలి అద్దాలమాటున లేతకునికిపాట్లు అభ్యసిస్తూ కూచుంటాడు. ఇంగ్లీషుప్రశ్న తనమీాద పడినప్పుడు సమాధానం చెప్పడం గండమంత పని అవడంచేత సాధారణంగా ఆ గండం గడవక, విద్యార్థి గురువుగారి గౌరవార్థం స్తబ్ధులా నిలబడతాడు. అందుకని ఇంగ్లీషులో పాఠం జరిగేటప్పుడు కుర్రాడి నాలిక కేవలం ఖైదులోఉంటుంది. తెలియని మాటలు వినడం అతడికి పరిపాటి అవుతుంది. అక్కణ్ణించి తెలియనిమాటలు తప్ప అతడు విన్నేలేక, తనికి తెలిసేటట్టు మాట్లాడే ప్రతీవాడికీ సరుకు లేదంటాడు – ఉపన్యాసాల్లో ఒకొక్క శ్రోత తనికి తెలిసినచోటల్లా "హియర్, హియర్" అని హెచ్చరించినట్టు. క్రియముక్క — తెలియనిపాఠం గంభీరంగా మెచ్చుకోడం, మర్యాదాగా దిగమింగడం, జీర్ణించుకోలేకపోయినా కిక్కురు మనకుండా అల్లరిలేకుండా కాలం వెళ్ళబుచ్చుగోడం, కుర్రాడికి అనుదినవ్యాపారం. మేష్టరు ఇంగ్లీషులో

కోప్పడుతుంటే కుర్రాడికి కోపం లేదు, విచారకరమైన విషయం చెబితే విచారం లేదు, నవ్వుమాటలు చెబితే నవ్వులేదు. తెలియదుగా!! అల్లాంటప్పుడు ఇంగ్లీషు చెప్పేమేష్టరు అదొక మోస్తరు చిన్నతనంలాంటి అపజయం అనుభవిస్తాడు. ఎంచేతంటే ఎదేనా ఒకటి గొప్పమాట అనుకుని, ఒకడు, సభవారిమీాద ప్రయోగించినప్పుడు అది పట్టిచ్చిందా సరేసరి; పట్టివ్వక దెబ్బ తేజోటయి మాట తేలిపోయిందా, వాడు కొంచెంకుంగిపోయి అది తనికి కేవలం శిరశ్ఛేదం అనుకుని ఇతరత్రా ప్రయత్నించి మరోటీ, ఇంకోటీ చెప్పగొచ్చి, చేతా వాతా అయినంత మట్టుకు నెగ్గడానికి, చెమటపట్టేవరకూ శరీరం ధారపోస్తాడు. అల్లాంటి అపజయం నివారించుగునేటందుకు ఇంగ్లీషుని పాఠం చెప్పే మేష్టర్లు - తమరికి తెలుగు రాదని చెప్పగుంటూ (అల్లా చెప్పగోడం పూర్వంలో మహానుభావత్వానికి లక్షణం అనుకునే వారు) తన భావాన్ని తెలుగులో అనేసేవారు. 'ఒస్, ఇం తేనా' అనో, వైరుధ్యంవల్లో కుర్రాళ్ళు నవ్వేవాళ్ళు. దీన్ని బట్టి నవ్వుకోడానికి తెలుగుభాష అనిన్నీ, ఎక్కడ తెలుస్తూంటే అక్కడ నవ్వవలిసిందే అనిన్నీ చాలామంది బుద్ధిమంతుల తాత్పర్యం అయినట్టు తోస్తుంది. అంచేత తమరి మాతృభాష తమరే వేళాకోళం చెయ్యతగ్గభాష అని ఒక్కొక్కకుర్రాడు అనుకోడానికి మార్గం ఒకటి దొరుకుతోచ్చింది. ఇక ఇల్లాంటి భాషలో పాఠం చెబుతా నని బయలుదేరిన ఘటం — మూర్తీ భవించిన వెక్కిరింత, తనువు దాల్చిన అమాయికత్వం, ఘుసేభ

వించిన అప్రయోజకత్వం, ఖాయపడిన అనాథత్వం, పండి పోయిన చాదస్తం అనేటటువంటి భావం కుర్రాళ్ళహృదయంలో అంకురించి ఊరుకోక కుదురుగట్టి వేరుబారడంలో ఆశ్చర్యం ఏముందీ! అందువల్ల ప్రతి విద్యార్థికీ తెలుగుమేష్టరు దర్శనం అయేసరికి, లోగడ వ్యక్తం కావడానికి వీల్లేక నిల్చిపోయిన అనేక చేష్టలు గోచరిస్తాయి. అక్కణ్ణించి, మాటచమత్కారం, హాస్యం, వెటకారం, ఎకసక్కెం, కన్నుగీటడం, అబద్ధం ఆడడం లాంటి లక్షణాలు వచ్చిపడతాయి. కొందరు వేషాలు వేస్తారు. కొందరు మొద్దుకోట్లు అప్పుడు తొడుక్కొస్తారు. కొందరు ఆ గంటలో పెద్ద పెద్ద బుట్ట తలపాగాలు చుడతారు. కాబట్టి మామూలుగానే అల్లరిచేసే విద్యార్థి తెలుగుక్లాసులో పట్ట పగ్గాలు లేకుండా ఉంటాడు! అదివరదాకా పిల్లిలాగ ఏఅల్లరీ లేకుండా ఉన్నవాడుకుడా అమాంతంగా ఆడపులిలా లేస్తాడు. ఒక పెళ్ళి సంబంధంలో పెళ్ళికొడుకుయొక్క మంచితనం పొగు డుతూ ఒకాయన – "అబ్బే! పెళ్ళికొడుకు ఎంత నెమ్మది గలవా డనుకున్నా రేమిటి? స్కూలు 'ఫైను' పరీక్షవాళ్ళ మొహాన్ని దరఖాస్తులకోసం అన్ని రూపాయలు పోశాడా, అయితేం, నిగర్వి. ఆఖరికి తెలుగు క్లాసులోకుడా అల్లరి చెయ్యడట !" అన్నాడు. అనగా, శరీరస్థితి వీల్లేక ఏదో జబ్బులో పడిపోయి ఊరుకోవాలి గాని కుర్రా డేమిటి తెలుగు క్లా సేమిటి అల్లరి చెయ్యకపోవడం ఏమిటి – అని. తెలుగు క్లాసులో అల్లరి చెయ్యని పీనుగుల్ని తక్కినవాళ్ళు ఏడిపిస్తారు, "మర్యా

దస్తుడు బయల్దేరాడయ్యా మహా!" అంటూ. అందుకని ఎవళ్ళూ మానరు. ఒకడు అనవసరంగా ఒళ్ళు విరుచుకుంటాడు, ఒకడు ఆవలింతలు, ఒకడు తెగతుమ్ములు వగైరా. ఒకడు కాగితపు పడవలు చేస్తాడు. జుట్లు లేనికాలము కాబట్టి జుట్టూ జుట్టూ ముడెట్టడానికి వీల్లేక, ఒకడు, బట్టా బట్టా ముడేస్తాడు. ఒక్కొక్క పెద్దపన్నాముతగ .మానీటరు హాజరుపట్టీ నిమిత్తం మేష్టారి కుర్చీదగ్గర నిలబడి మేష్టారిజుట్టు కుర్చీకి ముడెయ్యబోతాడు. ఒక్కొక్కప్పుడు ఎక్కణ్ణించో తెలియకుండా చిన్న చిన్న రాళ్ళు మేష్టరుమీదపడి ప్రమాదం అంతపనిజరుగుతుంది. ఒకడు మేష్టరు వెనకాల కెళ్ళి ముఖం వికారంగా పెట్టి తెయితక్కలాడతాడు. ఒకడు వెనకాలే నడిచి మేష్టరుమీద, పన్నీరు అప్పట్లో లేక, సిరా చిలుకుతాడు. కొందరు కొందరు బల్లలు బాత్తారు. కొందరు జంతువుల కూతలు అభ్యసిస్తారు – అనగా, గర్జన, గాండ్రింపు, సకిలింపు, ఓండ్రపెట్టడం, మొఱుగు ఘుర్ఘురింపు, అంకె, బుస మొదలైనవి, వాచకాల్లో చిన్నతనంలో చదివినవి నెమరికొచ్చి! ఒక్కొక్కప్పుడు ఒకడు బయలుదేరి పక్కవాడు తనని కూనీచెయ్యడానికి సర్వసిద్ధుడై ఉన్నాడనిన్నీ, తనవల్ల తప్పులేదనిన్నీ, కూనీ జరుగుతుండగా పండిట్ చూసి ఊరుకున్నట్టు తనెళ్ళి హెడ్‌మాస్టరుతో రిపోర్టు చేస్తాననిన్నీ బెదరిస్తాడు. తెలుగుక్లాసులో జరిగే అల్లరికి నాయకత్వం దొరకడం అనే అదృష్టం పట్టినవాడి జన్మ సఫలం అనిన్నీ, వాడికి పునర్జన్మ ఉండబోదనిన్నీ, దేవుడు వాడికి జంతుజన్మ

ప్రసాదించనందుకు దేవుడి ఋణం, తెలుగు దేశం తన్ని కన్నందుకు దేశఋణం, తనతల్లిది తెలుగు అవడంవల్ల తెలుగుఋణం వాడు ఆ దెబ్బతో నిస్సందేహంగా తీర్చిపారేశాడనీన్నీ, మానవత్వం సార్థకం చేసుకోడానికి అంతకంటె మహోత్తరుణం ఉండదనీన్నీ, కొందరి సంకల్పమూ అనిపిస్తుంది. కొందరు మాటకార్లు అప్రస్తుతప్రశంస మొదలెడతారు. కొందరు తెలుగు మేష్టరుగారి ఇతరవ్యవహారాల్లో ప్రవేశిస్తారు. కొందరు ఆయనే చేసిన పుస్తకంయొక్క ప్రాశస్త్యం కొనియాడతారు. దాంతోటి ఆయన ఉబ్బిపోయి తన గ్రంథం అంత గొప్పదైనప్పటికీ తను దానికి చాలా తక్కువఖరీదే పెట్టాననీ, అల్లాంటివి ఈ కాలంలో బయలుదేరటం లేదనేమోస్తరులో లెక్చరు ఇస్తాడు, పాఠం ఏష్యం అయిపోతుంది. విద్యార్థులు కనుసంజ్ఞలు చేసుగుంటూ ఆనందిస్తూంటారు. ఒక్కొక్కప్పుడు, పఠన గ్రంథాలుగా నియమింపబడ్డ టెక్స్టుబుక్కులనే తద్దినపుగ్రంథాల్లో శృంగారఘట్టం తగుల్తుంది. అందులో ఉన్న అశ్లీలపదాలకి అర్థం చెప్పవలసి వొచ్చినప్పుడు, తెలుగు మేష్టరు ఎవరితల్లి మీదో చెప్పక భేకగతి అవలంబిస్తాడు. అటువంటి సమయంలో ఆయన్ని ఆపి అక్కడే తనకి అర్థం తిన్నగా అవటంలేదని ఒక్కొక్కద్విపాదుడు పట్టుపడతాడు. గౌతముడిశాపం, కర్ణజననం, పాండవులజననం, ఊర్వశిశాపం ముదలైనవి ఇల్లాంటి కండగత్తెర స్థలాల్లో కొన్ని. క్లాసులో దైవాధ్యా ఆడపిల్లలే ఉండడం తటస్థించిందా, పైరీతి ప్రశ్నలు ఒక్కరవ్వ జోరుగా

ఉండడంలో ఆశ్చర్యంలేదు. మరోడు క్లాసులో ఉన్న ఆడపిల్లల పేర్లు ఇతర అర్థంతో వచ్చే ప్రశ్న లడుగుతాడు. "మేష్టారండి, వీడు మిమ్మల్ని బూతులు తిడుతున్నాడండి" అంటూ ఒకడు ఇంకోడిమీద తమాషాకి పితూరీచేస్తాడు. ఒకడు ఆలస్యంగా వచ్చి కూచుని, "ఏమిరా" అంటే "మాఇంట్లో గడ్డిమోపు వేయించివచ్చాను." అంటాడు. ఇంకో అబ్బాయి మహా మతావేశంతో "ఈవేళ నక్షత్రం ఏమిటండి మేష్టారూ!" అని, "ఎందుకురా?" అని ప్రక్కవాడు అడగ్గా, "ఉండరా, మా మామగారి కూతుర్ని తీసుకురావాలీ!" అన్నాడు. ఓ తెలుగుమేష్టారికి కూతురు పుట్టినసంగతి ఆయనతో ఓఅబ్బాయి క్లాసులో ఉన్నప్పుడే చెప్పడంతోటే, ఇంకో పిల్లాడు జయ్ మనిలేచి, "అల్లాయితే నేను తెలుగుమేష్టార్ని మామగారూ అని పిలవాలిగావును" అన్నాడు. తెలుగు గంటకోసమే బోర్డు మీద తప్పుడురాతలు రాసి ఉంచేవాళ్లుంటారు. ఆగంటలో అందరి జేబుల్లోనూ ఉన్న సరుకు కలపోస్తే, ఓ అల్పాహార విందు చెయ్యొచ్చు. తెలుగుక్లాసులో దీపావళిఅమావాస్య, ఆక్రితం పౌర్ణమికి ప్రారంభించి తరవాత పౌర్ణమిదాకా ఉంటుంది.

ఆంధ్రదేశంలో ఉన్న ప్రతీ విడి తెలుగుమేష్టరుపట్లా సర్వత్రా ఈస్థితి అక్షరాలా ఇల్లానేఉంది గావును అనుకోడం పొరపాటు. కాని, పైనఉన్న ఉదాహరణలు అసలు పేర్లు తీసేసిన యథార్థాలు గనక, సూత్రించిన స్థితి అబద్ధం అనే సెయ్యడంకూడా పొరపాటే. ఇక, ప్రతీసూత్రానికి లెక్కకొన్ని

ప్రతిబంధకాలు ఉన్నట్టుగానే, తమరు బోధించేది దిక్కు-లేని తెలుగయినా తమరి యితర ప్రజ్ఞలుకూడా ప్రయోగించి ఇటు కుర్రాళ్ల మన్ననా, అటు అధికారుల ఆదరణాకూడా పొందిన అధ్యాపకులు కొందరు ఉండేవారు, ఉన్నారు. అందుకని, ఈ స్థితి సిద్ధించడానికి తంటాలుపడ్డ వాళ్లని స్మరించుగోడంనయం. వాళ్లెవళ్లూ, ఎంతమందీ అంటే, "పంచైతాని మహాబాహూ". లేకపోతే, పెద్దలు సాధారణంగా అంటూండే "నా (నరు?) చేతను, నీచేతను, వరమడిగిన కుంతిచేత..." అనే ప్రాసతప్పు పద్యంలో లాగ చాలామంది!

ప్రతీపనీ చేసో చేయించో సాధారణంగా గైరుహాజరు అయిపోవడమే అభ్యసిస్తూంటాడు గనక మొదటిముద్దాయి దేవుడు! దిక్కు-మాలి కర్మం దేవుడికి తెలుగు రాదని రిసర్చివల్ల కని పెట్టినట్టు చెబుతారు మరి! నేర్చుగోడానికికూడా అతడికి తీరుబడి లేనట్టు వినబడుతుంది. తెలుగు వేరు, దేవుడిభాష వేరు. ప్రార్థన వగైరాలు తెలుగులో చేస్తే అతనికి ముట్టవేమో అని చాలా మందికిభయం అందుచేతనే! తెలుగు గురించి దేవుడు ఇంకా ఏపుణ్యాం కట్టుగున్నాడంటే, పురాణపురుషుల భాష ఇది కాకుండా మరోటిఅయేటట్టుచేసేశాడు. కృష్ణుడూ తెలుగువాడు కాడు, రాముడూ తెలుగువాడు కాడు. ఒకవేళకృష్ణుడికి గుజ రాతీ కాక హస్తినాపురసంబంధంవల్ల హిందీభాషానూ, రాము డికి హిందీ కాక లంకాద్వీపసంబంధంవల్ల అరవభాషానూ తెలిసేవేమో! అదీకాక, దేవుడు ఈ తెలుగుని ఎప్పుడు రాజ

భాషగా వెనకటి కాలంలో ఉండనిచ్చాడో మనం ఎరగం గాని, ప్రస్తుతంలో ఆ పదవి దాని కివ్వనిసంగతి అందరికీ తెలుసు. ముందు ఎప్పుడో ఇస్తాడు గావును అనకు నేటందుకు ఆధారాలుగాని, ఆఖరికి దారాలుగాని లేవు. అందుచేత ధనాధికార సంపదలుగల తెలుగువాళ్ల చేత మన్ననపొంద డానికి తెలుగు నోచుకోలేదు. ఇంకా ఆలోచిస్తే, ప్రపంచ ఖ్యాతి పొందిన భారతీయకవుల హృదయాల్లో తెలుగుస్మరణ లేకుండా దేవుడు కట్టుదిట్టం చేశాడు. చూడండి, తెలుగు వాళ్లు తమకియొక్క ప్రతీసందర్భంలోనూ అర్థం చూచుగో కుండా సగర్వంగా పాడుతూండే 'జనగణమన' అనే సర్ రవీంద్ర బాబుగారి భారతదేశపుపాట! అందులో తెలుగుప్రమేయం లేదు. రాష్ట్రాల పేర్లల్లో (పాటయొక్క రచననాటికి, అనగా ౧-౧-౧౯౧౧ నాటికి ఒరిస్సా అనేది వేరురాష్ట్రం కాకపోయినా) 'ఉత్కల' ఉందిగాని 'ఆంధ్ర' లేదు. అది 'ద్రావిడ' అనే శబ్దంలో లీనం అయిఉండింది అని మనం అనుకోవాలి — పప్పు, సాంబార్‌లోలాగ! నదులపేర్లల్లో 'గోదావరి' లేదు; కాని, 'గంగా' 'యమునా' కూడా ఉన్నాయి! ఇంకా చెప్పాలంటే, తెలుగుఅక్షరసముదాయానికి రూపంలో పూర్ణత్వమున్నా (లలిత ముక్తాఫలాకార విలసనము - అంటాడు తెనాలి రామ కృష్ణుడు), ఉచ్చారణలో మృదుత్వమున్నా ఇచ్చినా, వ్రాతలో మితత్వంగాని, నిశ్చితత్వంగాని, సమగ్రతగాని, సంక్షిప్త లేఖనావేగానికి వృద్ధిగాని భగవంతుడు ప్రసాదించలేదు.

రెండో కారణం అధికారులు. అధికారులంటే గవర్న మెంటు కాదు — వారికి ఉండే గొడవల్లో ఈ తెలుగుగొడవ ఎందుకు! అయినా, వాళ్ళు తెలుగువాడి మీద కర్తవ్యం పెట్ట కుండా తెలుగుతద్దినం ఏదీపెట్టరు. మరి అధికారులంటే ఎవరు? విద్యాశాఖలో తెలుగు తరఫున ఉండే పాలకవర్గంలో సభ్యులు. దిక్కులేని తెలుక్కి వాళ్ళనే అధికారులు అనుకోవాలి. సాధార ణంగా వారిలో ఆంధ్రేతరులు ఉండవచ్చు. వాళ్ళనిగురించి కష్టంగా ఏమీ అనరాదు. ఏమంటే వాళ్ళది తెలుగు కాదు. ఆ అధికారుల్లో ఒకరకం తెలుగువారుండవచ్చు. వాళ్ళల్లో చాలామందిని ఏమనీ లాభం లేదు. వాళ్ళ మాతృభాష తెలుగైనా దానియందు వారికి ప్రవేశంగాని, వాత్సల్యంగాని ఉండవు. వాళ్ళు పుణ్యావశంచేత తెలుగురాని తెలుగు వాళ్ళవడంచేతనే ఆ అధికారపదవి అందగలిగిఉంటారు. ఇక, ఆ అధికారుల్లోనే తెలుగులో ప్రావీణ్యత ఉండి తెలుగుమీద ప్రసన్నత గలిగినవాళ్ళు కొందరేనా ఉండితీరతారు అనుకుం దాం. అటువంటివారు ఏకాకులవడంచేత స్వతంత్రించి ఏదేనా తెలుగువిషయం సంస్కరణ ఉద్దేశించినట్టాయినా, చేతులో ఉన్న ఆకాస్త అధికారంకుడా అమాంతంగా ఎక్కడ లేచి పోతుందో అనే భీతిగలవాళ్ళవడంచేత, వాళ్ళవల్లకూడా తెలుక్కి ఏమీ ఆదరణ జరుగుతూండదు. కాని, అటువంటి వాళ్ళవల్ల స్వల్పమైనటువంటిమార్పులుకొన్ని సూచింపబడచ్చు. పైవారికి డబ్బు తగులుబాటు లేకుండాఉంటే అవి ఆచరణ

లోకి కూడా దిగవచ్చు. అయినా, తెలుగుమేష్టరు జీతం ఇంగ్లీషుమేష్టరు జీతంలో సగంకూడా ఉండదు, కాని అతనికి రెండుభాషలు రావాలి, సర్వీసుకూడా రెట్టింపు ఉండచ్చు. ఇంగ్లీషు పాఠం ఎన్నిగంటలు చెబుతారో అందులో సగం గంటలు తెలుగుపాఠం. ఇంగ్లీషు పాఠం పేపరుఒకటికి దిద్దినందుకు ఎంతిస్తారో అందులో సగం తెలుక్కి. దినచర్యలో పాఠక్రమం నిర్ణయించేటప్పుడు తెలుగుపాఠాన్ని చివరగంటలకి పారెయ్యొచ్చు - ఎంచేతంటే పిల్లలు అప్పటికి విసిగిపోతారు గనక తెలుగు నేర్చుగోడానికి సరియైనస్థితిలో ఉంటారు. స్కూలుఫైనలు ఇంగ్లీషు పఠనగ్రంథం చివర, ఇటీవల, టీక ఉండటంలేదు. కాని, తెలుగు పఠనగ్రంథం చివర టీక నేటివరకూ ఉంది. ఊరికే ఉండడమే కాకుండా అసలుకంటె ఎక్కువగాఉంది. పైగా మరోటి, ఏటేటా విశేషమైన సామగ్రితో పెరిగిపోతోంది. ఆంగ్లభాష తెలుగుజాతిబిడ్యేలకి అందరికీ గళగ్రాహిగావచ్చు ననిన్నీ, తెలుగుచెప్పే మేష్టర్లకిమాత్రం తెలుగు రాదనిన్నీ అధికారుల భయం అయిఉంటుంది. ఇంగ్లీషు పాఠాలకి టీక, చివర వేస్తే ఆటీక చదివేసుగుని ప్రతీకుర్రాడూ క్లాసులోకి సుళువుగా వస్తాడట, దాంతోటి ఇంగ్లీషుమేష్టరు చెప్పడానికి ఏమీ ఉండదుట! అదీకాక, కుర్రాళ్ళంతా ఆ చివరటీక కంఠతా పెట్టేసి రామ చిలకలలాగ పరీక్షల్లో క్లేటువేసేసి, మూర్ఖులైపోయి, పాసైపోతారట! పైగా, ఆటీకలో ఉండ గలట్టి ముక్కలు, కుర్రాడు, నేరుగా ఇంగ్లీషుచెప్పే మేష్టరునోటంటనే విని, అవన్నీ ఆయన

తన అపూర్వాఖండ మేధాసంపత్తివల్ల ఆశువుగా విశేషార్థా లేమిటి, పూర్వగాథ లేమిటి, వ్యాకరణ విశేషాలేమిటి, చూసీచూడగానే ఊహించి చెబుతున్నారని అనుకో డానికి వీలు చెడిపోతుందేమో అని భయంట! ఈసబబులు తెలుగుపఠన గ్రంథంగురించి లేవుట. ఇంగ్లీషుప్రశ్నపత్రంలో కుర్రాడు కసివిని ఎరగని పద్యరచనని హృద్గతం చేసుగుని, పూసగుచ్చినట్టు వాడి స్వంత ఆంగ్లంలో చెప్పవలసిందని అడిగేప్రశ్నలు ఉండవచ్చుట. తెలుగుపేపరులో అటువంటి పనులు, ఎవరో కూడదు అనిఉంటారు, లేవు. ఇంగ్లీషులో ఉత్తరాల మతలబులన్నీ రావాలిట, తెలుగులో, వచ్చి లాభం ఏమిటని గావును, అక్కర్లేదు. ఇక భాషానువాదం ఇంగ్లీషు లోంచి తెలుగులోకి మాత్రమే ఉంచారు, ఆమార్కులు పట్టి గెల్లి తెలుగులో కలిపెయ్యమన్నారు. ఇంగ్లీషులో ప్రజ్ఞఉంటే తెలుగులో ఉందన్నమాటే! ఆంగ్లభాషేతర పాఠాలన్నీ తెలుగునే కానియ్యవలసిన ఈరోజుల్లో ఆంధ్రభాషా వ్యాపారం ఏమయిందీఅంటే, పరిభాషల నిమిత్తం అదనంగా సంస్కృతం కూడా ప్రవేశించి గురు శిష్యులకి ఒక్కరవ్వ ప్రాణంమీదికి తెస్తోంది. అది యిక్కడ అప్రస్తుతం.

సరి, శాస్త్రం చెప్పినట్టు మూడో కారణం తనే! మామూ లుగా తెలుగుమేష్టరికి రావలిసింది ఇంగ్లీషుకాదుగనక రాదు. కుర్రాడికి కొన్ని ఎంగిలిముక్కలు వస్తూపోతూఉంటాయి. అల్లాంటివి రానివాళ్ళని చూస్తే కుర్రాడికి నిరసన. తెలుగు

మేష్టరికి సంస్కృతం రావాలి, వస్తుంది. ఎంతవరకూ అంటే, తెలుగువాళ్ల నోరు మూసేటందుకు, సరిపోయే ఉంటుంది. ఆసంగతి కుర్రాడికి మరీకోపం. తెలుగుమేష్టరు సంస్కృతం వాడకమానడు. అది కుర్రాడికి ఎంతోమంట. ఒక్కొక్క తెలుగు మేష్టరికి కేవలం సంస్కృతంమాత్రమే వస్తుంది. అతడు తెలుగులో పుస్తకాలు ఏమీ చూడకుండానే వాటిలో ఏమీలేదని గ్రహించి మరివాటిని చూడని రకం. ప్రమాణ లక్షణలక్ష్యాల్లో ఏంకావలసినా సరే బలువుకోసం అతడు సంస్కృతంలోంచే యిస్తాడు, పుచ్చుగుంటాడు, తెలుక్కి అంటగట్టి రుద్దుతాడు. అతడు తెలుగుగురించి కుర్రాడికి ఆసక్తి పుట్టించడు, ఆవేశం ఎత్తించడు. ఒక్కొక్కడు నవీనవిజ్ఞానం జ్ఞానంలో జేరదంటాడు. ఒక్కొక్కడు తెలుగులో ఏ పూర్వ కవులోన్న వాళ్లపాండిత్యం స్మరించి 'సరే' అని ఒప్పుగుంటాడు. బతుకున్నవాళ్ళ (అతని ఉద్దేశంలో) మృతనష్టపు పుస్తకాలు ఏ పరుసవేదివల్లో పఠనగ్రంథాలుగా మారిపోయి అవి తనే చెప్పవలసిన ప్రారబ్ధం తనికి పడితే, ఒక్కొక్క తెలుగుమేష్టరు అవి నేల్నెట్టికొడతాడుగాని పాఠంచెప్పడు. తెలుగు మేష్టరు భాషాసంస్కారంకోసమే పాకులాడతాడుగాని, కుర్రాళ్ళలో నవ్యభావోదయం కలగడానికి ఆలోచన చెయ్యడు. అలాంటి వాడు పాఠం చెప్పేటప్పుడు మొదట్లోనూ మధ్యా చివరా 'మాత్రం పురాతనవ్యాకరణ - లేక ఆదివ్యాకరణ - దస్తరం విప్పడం అన్నమాట. అతడిపరమావధి పాతవ్యాకర

ణాన్ని అనుసరించడమే! వ్యాకరణం భాషకి అస్థిపంజరం వంటిది అవడంవల్లా, పైగా అది లాభండుండని తెలుగుతాలూకు వ్యాకరణం అవడంవల్లా, ఒక్కొక్క వ్యాకరణసూత్రం వినమన్నప్పుడల్లా డోక్కుని నేర్చుగోమన్నప్పుడెల్లా హాలో మని గోలెత్తుతాడు, ఆంధ్రవిద్యార్థి! తెలుగుమేష్టర్లు ఇటీవల బాగా ఇంగ్లీషు తెలుసుగుని, వ్యవహరించేవారు ఉన్నా, ఇంగ్లీషుని నిలువునా చీరి మాట్టాడేవాళ్ళూ ఉన్నారు:- "ఆఫ్టర్ ఐ ఎక్స్ప్లనేషన్ యూ, నో నాట్", "ఐ ఫైన్ యు బై యూస్ ఫోర్", "వై డు యు లేట్", "వై డు యు టాక్ మీ వెన్ ఐ స్పీచ్ హిం" మాదిరిగాఉండే వాక్యాలు కుర్రాళ్లతో జరిగేటప్పుడు హెచ్చుతగ్గు వచ్చితీరుతుంది. ఒక కుర్రాడు కుడిచేతి చిటికినవేలు చూపించినప్పుడు అవుటికి వెళ్ళమనడానికి ఓఆయన "వెళ్ళవోయ్ కుంకా" అనడానికి "గానెవే ఫూల్" అనేవాడు. ఆమాత్రం జాతిభాష ముక్కలు తెలియక ఎదేనా ఇంగ్లీషునోటీసు వస్తే ఒకణ్ణి చదవమనడం, వాడు తనచిత్తంవొచ్చినవి వల్లించి అక్కడ ఉన్నదానికి అర్థం అనడం, చివరికి పైవారు తెలుగు పండిట్ని కబడ్డారుగా ఉండ మన్నారని ముగించడం. ఒక్కొక్కమేష్టరు తన కుర్చీని శ్రద్ధతో తను అలంకరించకపోవడంవల్ల చాలా గలిభీ జరుగుతుంది. పిల్లమూక గల్లంతులో పడ్డప్పుడు బల్లమీద తనే బాదుతూ, "ఇదేముటో తెలుసా! మీపిర్రమీద వాత" అనేవాడొక మహానీయుడు. దాంతో వాళ్ళు మరీ కూసేసరికి ఆయనకి మరీ

కోపం రెచ్చి అందర్నీ బెంచి యెక్కమనడానికి "గెటప్ బెంచ్" అని ఆయన అనగానే సాయంపట్టి బెంచీలన్నీ చేతులమీద నిలబెట్టేవారు. మరో మేష్టరు కుర్చీలో జోగిపోతూ పాఠం చెబుతాడు. అప్పుడు ఊహగల పిల్లాడెళ్ళి తనటోపీ (అప్పుడు ధరించకపోతే దండించేవారు) ఆయనకి విసరడం-బుట్టమూతతో పడగెత్తిన పాముకి విసరడం జ్ఞాపకం వచ్చి! ఒకొక్క తెలుగుమేష్టరు పేపర్లుదిద్దితే అంతా ప్యాసే! అదేమిటంటే అహింసాతత్వం అని సమాధానం. లేకపోతే ఐ. సి. యస్. లో లాగ కావలిసినంతమంది ప్యాసు! వ్యాస రచనలో విషయం 'గుఱ్ఱం' అయినప్పుడు ఒకవేళ విద్యార్థి 'గాడిద' గురించి రాశినా వాడిఉద్దేశంమంచిది, ప్రజ్ఞకనపరిచాడు పండితా స్సమదర్శినః అన్నాడు అని మార్కులు యావత్తూ బేబాకీగా ఇచ్చేసేవాడు. ఒక తెలుగుమేష్టరికి దయారసం విస్తారం అవడంచేత పరీక్షావస్థలో కుర్రాళ్ళప్రాణాలకి తన ప్రాణం అడ్డేసి, ఒకడు రాసిన కాగితం ఇంకోడికి తనే అందించి పుణ్యాం హస్తగతంచేసుకునేవాడు. రెండోకంటివాడికి తెలియకుండా జాగ్రత్తగా కాపీచేసుకోమని ఓఆయన చెప్పేడే వాడు. ఒకొక్కరు కుర్రాడిమీద కోపంవచ్చి, ఆగలేక తను వాణ్ణి శిక్షించక, పైకి రిపోర్టు చెయ్యడానికి బయల్దేరి మధ్యదారిలో కుర్రాడు "మేష్టారండి, మేష్టారండి" అనేసరికి కరిగి తిరిగి వెళ్ళిపోడంలో "నిందుమనంబు నవ్య..."స్ఫురణకి తెస్తారు. ఇటీవలివారిలో తెలియదుగాని శాస్త్ర పూర్వంవారిలో,

ఏయిద్దరు ఒకచోటచేరినా, కొత్తరికంలో మిక్కిలి పొత్తుగా ఉండి, వారం పదిరోజులయేసరికి, వీరికి రామశబ్దం రాదని వారూ, వారికి గుణింతాలు రావని వీరూ దెప్పేసుగునేవారు. పరీక్షలనేవి ఏవీ అప్పట్లో లేకపోడంనించి (పరీక్షలవల్లపాండిత్యాలు ఎల్లా నిర్ణయింపబడుతున్నాయో చూస్తునే ఉన్నాం!) ఎవరికెన్ని తెలివితేటలున్నాయో తెలుసుగోడానికి మరో మార్గం కనిపించక వాళ్లు వాగ్వాదన లగాయతు అవాచ్యాల ద్వారా మల్లయుద్ధాలవరకూ వెళ్ళేవారని తెలుస్తుంది. వారి వైషమ్యాలు జన్మజన్మేకీకుడా నిల్చిపోయే తార్కాణాలు కనిపిస్తూండేవి. కుఱ్ఱాడు ప్రశ్న ఏదేనా తప్పిపోయినప్పుడు ఒక్కొక్క మేష్టరు, " నువ్వు నిరుడు ఆవెధవదగ్గిర తెలుగు అహోరించి వచ్చావ్ కాదూ! ఆవెధవకి తెలుగెంత వచ్చి చచ్చిందో నీకూ అంతే రాక చచ్చింది!" అనడంకూడా వినిపించేది.

నాలుగోకారణం విద్యార్థులే అనడం తప్పేకాని, తప్పదు. విద్యార్థుల్లోకొందరు విద్య అర్థించనివాళ్లు ఉండవచ్చు. కేవల దురాలోచనగాని, దూరాలోచనగాని చిన్నమనస్సుల్లో వేంచేసి ఉంటుందనుకోడం అమానుషం. శిష్యపాపం గురుర్వ్రజేత్ అని గదా అంట్రారు. తెలుగుదేశపు విద్యార్థి తన హృదయప్రతినిధియైన తెలుగుయొక్క స్వరూపాన్ని తనికి అవగాహనలోకి తెచ్చేవాళ్ళని తను ద్వేషించినా, హింసించినా, దూషించినా, తిరస్కరించినా, చప్పరించినా, నిరసించినా, అది

మాతృద్రోహం కాకపోయినా తప్పకుండా ఆత్మద్రోహంకిందికీ, తద్వారా దేశద్రోహంకిందికీ వస్తుంది కాబట్టి హాస్యాస్పదం అనడం కంటే దాన్ని శోచనీయం అనడం న్యాయంగనక నన్నూ, చిన్నవాళ్ళకి నిందావిషయాల్లో వాటా చిన్నదిగానే ఉండితీరాలని అనుభవశాలురు మధ్యవర్తిత్వంచేసి చెబుతారు గనకనున్నూ ఈ ఉపవిషయం ఆపేస్తాను.

ఐదోకారణం తెలుగువిద్యార్థుల తండ్రులు అనగా తెలుగు నాయనలు. తనకొడుకు ఒఖ్ఖ తెలుగులో మాత్రం విద్యార్థి దశలోనే తెగపండితు డైపోవాలని ఏ తెలుగుతండ్రీ కోరుకోడు కదా! సరికదా, ఒఖ్ఖ తెలుగు మినహాయించి ఏయితర అంశంలోనేనాసరే, పాండిత్యంమాట దేవుడికి తెలుసును, ఆఖరికి ప్రవేశమైనాసరే లేక - చివరికి స్పర్శఅయినాసరే ఉంటే పోనీ కొంతనయంగదా అని పరితపించుతాడు. అసలు కుర్రాడి నిమిత్తం ఎప్పుడైతే తమరు ఫీజు కట్టేసి వాణ్ణి సాలుకి ౧౮౦ రోజులమాత్రం - అందులో రోజుకి ౫ గంటలుమాత్రం బడికి పంపిస్తారో, ఆదెబ్బతోటి కుర్రాణ్ణి కాయడంపూచీ చీదాగా తమకి వదలిపోయి అక్కడితో వాడియొక్క శరీరాభివృద్ధీ, మనోవికాసమూ కలగడమేకాక వాడికి గుణశీలాలూ, సదభ్యాసాలూ, ధైర్యసాహసాలూ, మానమర్యాదలూ, క్షమాదార్యాలూ, సత్యధర్మాలూ పట్టుబడడం కుర్రాడు స్కూల్లో ఉండని ౧౯ గంటల కాలంలోకూడా కావచ్చునుగదా అనేమాటేనా ఒప్పుకోక, కుర్రవాడు ఒకవేళ ఫేలయితే ఆసంగతియొక్కధ్వని

తమరింటికి వినపడేవరకూ వాడిసంగతి నస్మరంతిగా చూసి ముఖ్యమైన ఇతరపనుల్లో లీనమై ఉండేవాళ్ళు, కుర్రాడికి తెలుగువచ్చిందో చచ్చిందో, అదంటే వాడికి సరదాగాఉందో పరదాగా ఉందో కనుక్కుంటూరా? చదువుకున్న తండ్రులైనా తాము తెలుగుని మన్నిస్తారా! తెలుగుభాష నిశ్చలం ఎంతవర కైందో, చంచలంగా ఎంతవరకుందో చూస్తారా! ఎవరెవరి తెలుగుమాటల సందేశంవల్ల తెలుగుమనుష్యులపేరు నిల్చిందో గమనిస్తారా! గమనించుకోమని కొడుకుతోనేనా చెబుతారా! కొడుక్కి పోనీ ఆ వేమన "ఉప్పుకప్పురం" అనుకోండి, ఆపోతన "ధరసింహాసనమై" అనుకోండి, బ్రహ్మోపదేశం చేస్తారా! పెద్దబాలశిక్షేనా వచ్చేటట్టుచేస్తారా! కొడుకు తెలుగుపద్యాలు కంఠపాఠం చేస్తే పద్యానికి ఓకానిచొప్పునేనా ఇస్తామని విలవకడతారా! సుగమం, మధురం, ఆకర్షణీయం, హృద్యం అయిన తెలుగుపద్యపాదాలు ఏరి, వారితో కలిసి మననం చేస్తారా! అటువంటిరత్నాలుగల పుస్తకాలు కొని వారికిస్తారా! తెలుగునిఘంటువే కొనక్కర్లేదని వాదించే తండ్రులు తక్కిన తెలుగుపుస్తకాలు తనవాడు కొనుక్కున్నాడోలేదో కనుక్కుంటూరా! తమ తాతముత్తాతలనాడేనా బలవంతం కాకుండా హృదయపూర్వకంగా తెలుగుకి రూపాయలు తెచ్చే విలవ ఉండేదని విన్నారా! లేక తమనాడు తమరు చూశారా! హృదయాన్ని అంటిపెట్టుగుని ఉండే భావాలు ఇతరులకి తెలియ పరచడానికి తల్లిభాష తప్ప తక్కినవి బుద్ధిప్రజ్ఞవల్ల తెచ్చిపెట్టు

గున్న బాపతు బోబ్బిళ్లారా అని కొడుకులకి చెబుతారా! మంది తమరు నమ్ముతారా!

తెలుగు దేశపు ఇంగ్లీషు బళ్లో తెలుగు మేష్టరుస్థితి, తెలుగుస్థితి! అనగా, తెలుగు దేశంస్థితి! అనగా, తెలుగువాళ్ల స్థితి!!! నాకెవ డేనా గురువు అనేవా డుంటే వాడు నాహృదయం వికసింపజేసి నాపూర్వుల హృదయాలన్నీ వాళ్ళ మాటలద్వారా నాలో లీనం అయేటట్టు నాకు తెలుగుచెప్పినవాడే అనేటంతగా తెలుగు విద్యార్థి హృదయం (అది ఉం దని అంటారు గనక, పవిత్రం అని అంటారు గనక) మారాలి. ఉన్నస్థితీ, ఉండవలసినస్థితీ కొంచెం ఎడంగా ఉన్నాయి - ఒకటి దక్షిణధ్రువం, రెండోది ఉత్తరధ్రువం! అయినాసరే మార్పు రావచ్చు! ఇప్పుడు ఆంగ్లభాషేతరపాఠాలన్నీ తెలుగునేగా! 'రెండోభాష' ఏదవుతుందో !!

# గ్రంథప్రచురణ

ఒకే క్షణంలో అనేకులు ఒకే గ్రంథంయొక్క సారాన్ని ఆస్వాదించడానికి దానికి లిఖితప్రతులు గాని, ముద్రితప్రతులు గాని, తయారుచెయించడమూ, లేక సభాముఖాన్ని దాన్ని వినిపించి కనపరచడమూ మొదలైన పన్లు చెయ్యడం గ్రంథాన్ని ప్రచురణచెయ్యడం అవుతుంది. గ్రంథప్రచురణ చాలా బహుళం. అదంతా సూక్ష్మకాలంలో అల్పబుద్ధిగల నాబోట్లు చెప్ప బూనడం సాహసం. కాని, వర్తమానకాలంలో అన్యదేశ గ్రంథప్రచురణాఫలితాలు అందరికీ విశదం అవుతూండడంవల్లా, గ్రంథప్రచురణ అనే ఘోరం నేనుకూడా చేసినవాణ్ణి అవడం వల్లా, కర్తలకి సాధారణంగా ఉండే గ్రంథసృష్టిక్షోభేకాక దాని ప్రతులయొక్క చలామణీగురించిన బాధకూడా తెలిసి ఉండడం తప్పనట్టు కనుపించడంవల్లా, నేడు ఆంధ్రంలో గ్రంథ ప్రచురణాపరిస్థితుల్లో ఉండే వయినాలు కొంచెం స్మరిస్తాను. ఏరచనేనా గ్రంథం కావచ్చు, కాని పద్యగ్రంథాన్నిగురించే ప్రస్తుతం ముచ్చటించేది. అల్లానే, ప్రచురణ అనేకవిధాలుగా కావచ్చు, కాని అచ్చుప్రతులు తయారుచేయించడమే ఇప్పుడు నే ననుకునేది.

గ్రంథప్రచురణ అన్నప్పుడు గ్రంథకర్తా, ప్రచురణకర్తా — ఇద్దరే ముఖ్యులుగా కనిపిస్తారు. కాని, ఇతర గ్రంథసాంగులు బోలెడుమంది ఉంటారు. వాళ్లని ఒకక్షణం అల్లా ఉంచుదాం.

గ్రంథకర్త గ్రంథంయొక్క అంతస్సారంగురించీ, ప్రచురణకర్త గ్రంథశరీరం యొక్క రూపం గురించీ; గ్రంథకర్త గ్రంథం యొక్క జ్ఞానమూల్యంగురించీ, ప్రచురణకర్త గ్రంథంయొక్క పత్రముద్రణాది మూల్యంగురించీ — ఇల్లా వేర్వేరు దృక్పథాల్లో చూడ వలిసినవాళ్లయినా, ఇద్దరికీ అరమరలులేని అన్యోన్యమైత్రి ఉన్నప్పుడే నిజంగా దేశానికి లాభించే ఫలితం ఉండడం. పోనీ ఒకడే రెండుపన్లూ చేస్తే! అనగా ఎవడేనా గ్రంథసృష్టీ, గ్రంథప్రచురణా రెండూ తనేసాధించడానికి చాలినబుద్ధీ, ధనమూకూడా కలవాడైతే! అయితే బాధాలేదు బందీలేదు. కాని, నూటికీకోటికీతప్ప అటువంటి వాణ్ణిందిరా సమైక్యం అనే ప్రమాదం సంభవించదు. ఈవిషయంలో మన సంగతి ౧౯౦౯ లో రాస్తూ, హృదయకవి గురజాడ అప్పారావు అన్నది ఇది : "తెలుగు దేశంలో గ్రంథకర్తే సాధారణంగా తన ప్రచురణకర్తా, విక్రేతాకుడా కావలసిఉంటోంది'' అని. ఆ స్థితి రూఢిగామారిందని నేటికీ అనలేం. ఏకాలంలోనూ ఏదో రచన ఉంటూనేఉంటుంది. కాని, ఫలానా రచన మాకు కావాలి అనే జనంయొక్క సంఖ్యఉండిగాని, అది ఇంకా ఎక్కువ అవుతూన్నప్పుడు గాని అనేకప్రతుల అవసరమూ ఉండదు, ప్రచురణకర్త యొక్క జననమూ ఉండదు. జనం అంటే ఎవరు? తప్పకుండా బతికున్నవాళ్లు. వాళ్లేది కావాలంటారు? గొప్ప గ్రంథం కావాలంటారు. గొప్ప తెలుగు గ్రంథం అంటే ఏమిటి? మామూలు తెలుగువాడికి మధ్యవర్తుల సాయం లేందే ఓ పట్టాన్ని బుర్ర

చించుకున్నా సరే తెలియకుండా ఉండే తెలుగులాంటి భాషా పాకం – అని చాలామంది తెలుగువాళ్ల అభిప్రాయం. అల్లానే గొప్ప తెలుగుగ్రంథకర్త అంటే: గర్భ చిత్రబంధ శ్లేష ద్వ్యర్థి మర్మ గుహ్య అగమ్య అభేద్య అలౌకిక మొదలైన కవిత్వాలు వీటైనన్ని మృతపదాల్తో, చాంతాళ్లలాంటి తాజాసంస్కృత సమాసాల్తో, వ్యాకరణాన్ని పాడలగొట్టే నవీనాన్వయాలతో రచించడానికి సామర్థ్యం గలవాడు – అని ఇప్పుడుకూడా కొందరి అభిప్రాయం! అటువంటి రచయిత సృష్టించిన అటువంటి గ్రంథం మాత్రమే అచ్చుపడాలని వాళ్ల దెబ్బలాట.

కాని, భూలోకంలో ఉండే ఏ అరడజను మందికో మాత్రం తెలిసే గ్రంథానికి అచ్చెందుకు, అన్ని ప్రతులెందుకూ! తక్కిన మూర్ఖులకి ఉపయోగంగానూ, అందుబాటులోనూ ఉండేటట్టు ఆకర్షణీయంగా రచింపబడ్డది, విమర్శకులు ఎంత కొప్పడితేం గనక, ఎందుకు ప్రచురణ కాకుండాపోతుంది! అందుకని, ఎవరైనాసరే త్రికరణశుద్ధీ, వృత్తాంతమూ, భాషా, ఓపికా మొదలైనవి ఉండి గ్రంథం రాయచ్చు. అక్కడికి గ్రంథసృష్టి అవుతుంది! సరి. దానికి ఒక ప్రచురణకర్త ఉన్నాడందాం. ప్రచురణకర్తకి సారస్వతజ్ఞానమూ, భాషాభిమానమూ, పాఠక జనమనస్తత్వావగాహనా, జనాభిరుచి విచక్షణా, వ్యాపార నిర్వహణ సామర్థ్యమూ, లాభదృష్టీ, కృతజ్ఞతా లాంటివికూడా ఉంటాయని అనుకుందాం. అక్కడికి గ్రంథం అచ్చుపడి అనేక ప్రతిరూపాలు దాల్చడం అవుతుంది. బాగానే ఉంది. తరవాత

ఆప్రతులన్నీ చెల్లడంమాట! ప్రచురణకర్త ఎంత అంచనాశక్తి గలవాడైతేం, ఎవడు చెప్పగలడు! గ్రంథకర్త తన గ్రంథం తన మనస్సుయొక్క గారాబుసంతానమనీ, అది ఆచంద్రతారా ర్కంగా ఎక్కడో అక్కడ ఉండగలందులకు తను శాసించాననీ, అది వెనకటి గ్రంథాలన్నిటినీ తలదన్ని రాబోయే గ్రంథా లన్నింటినీ కాళ్ళట్టుగుని ఈడ్చిపారెయ్యగలదనీ అనుకోవచ్చు. ప్రచురణకర్త మా ఎక్కాగ్రంథం ఏరాం అనుకోవచ్చు! అనుకుంటేమాత్రం గ్రంథప్రతులు చెల్లద్దూ! ఒక్కొక్కగ్రంథం గట్టిఅట్ట, మేలుబైండు, దళసరికాగితాలు, చుట్టూఖాళీలు, పంక్తులమధ్య ఎడాలు, గొప్పవాడి సంతకంతో ఉపోద్ఘాతం, ప్రతీచోటా ప్రకటన ఘోష, పండితపామరహృద్యంగా గ్రంథం రాయబడ్డట్టు హెచ్చరిక, ఆకాశానికి ఎత్తేసే అభిప్రాయాలు, ఏ అర్థమేనా ఇయ్యగల సమీక్షలు, ఏరిన పడికట్టురాళ్ళతో బరువెక్కినవిమర్శ — వైద్యుడిమెప్పు మోతాదు — ఇన్నింటితో బయల్దేరినాసరే ఒక్కప్రతీ చెల్లకపోవచ్చు: నందికేశ్వరుడు నోంలో చలిమిడి చెల్లదే, ఆరీతిగా! కాని, ఒక్కొక్క గ్రంథంలో ఉన్న వన్నీ తప్పులూ, లేనివన్నీ మెప్పులూ, అయినా దాని ప్రతులు చెల్లచ్చు! ఆపళంగా, గొప్ప విమర్శ కుడు ఒకడు లేచి, గర్జించి — "ఒరేయ్ జనం! మొట్ట మొదట నాగ్రంథమూ, తరవాత నేమెచ్చినవీ మీరు మెచ్చుగోరేంరా మూర్ఖుల్లారా! నాఅంతవాడి ఉద్దేశంలో ఏమీ పసలేని పచ్చి పిచ్చి పుచ్చు చవట చెత్తంటే అల్లా పడి చచ్చిపోతా

లేమఁరా, మూర్ఖుల్లారా! నేచెప్పిన గ్రంథాలు మీఅంత శూన్యులకి విషప్రాయం అయినాయిగనకనే ఉద్గ్రంథాలఁరా మూర్ఖుల్లారా!" అంటూ, ఒతికున్న జనంయొక్క అభిరుచిని ఏకలాటుగా నిందిస్తూ, తనలాంటివాళ్ళు ఏకాసిని మందో తప్ప తక్కినవాళ్ళంతా మొత్తంమీద ముమ్మాటికీ మూర్ఖులు అనే ఘనవిషయం ఒంటరిగా కూచుని నిర్ణయించుగుని, తనవిజయం సాధించుగుంటాడు. పైగా పాండిత్యంఔన్నత్యమనీ, పామరత్వం వైశాల్యమనీ, గుర్తించుగోక, కొన్ని నీచగ్రంథాలు ఎవరో కొందరు తుచ్ఛులు కోరుతున్నారనే మిషమీద జనప్రియత్వం గల గ్రంథాలన్నీ తుచ్ఛమే అని సూత్రిస్తాడు. అతడల్లా విచారిస్తూంటాడు. ఇక పండిత గంథకర్త జనమనస్తత్వంతో నిమిత్తంలేకుండా, తనకంటె పండితులు తన రచన చూస్తారనే దుర్భ్రమతో గ్రంథం నిర్మించి, అది తన అల్లారు మానసిక ప్రతిబింబం అనుకోడమూ, నూటికి తొంభైమందికి నేటికీ వచనమే తెలియకపోయినా, తను అలంకార సహితంగాకన్న పద్యాన్ని యావజ్జనమూ ఆబాలగోపాలంగా నెత్తినిధరించేరోజు రాకపోతుందా అనుకోడమూ, ఆపడం బ్రహ్మతరం గాదు. ఒక రచన దేశానికి అవసరమైన గొప్పరచన అయినప్పుడు గాని జనంలో పాకదు. గొప్పతనంలేకుండానే ఏదేనా గ్రంథం జనంలో మాయమవడం బదులు వ్యాపించడం జరుగుతుందా ఆకాలం జనం అంతా భ్రష్టు లన్నమాట. రచనయొక్క గొప్పతనం, ఒకవేళ ఉంటే, అది పుట్టగానే తెలియనూవచ్చు, సాధార

ణంగా తెలియకపోనూవచ్చు. అక్కడికీ ఒక్కొక్క రచనయొక్క గొప్పతనం జనం వెంటనే కనిపెట్టకపోతారేమో అనే దిగులు చొప్పున ఒకొక్క విమర్శక జ్యోతిష్కుడు దానియొక్క భావి యోగం వీలైనంత అహంతో శాసిస్తూంటాడు. ఆశాసనాన్ని రచన వినలేదు, జనం విని గ్రహించుకోలేరు. ఏమైతేనేమి, గ్రంథగుణం ఎంతటిదైతేనేమి, గ్రంథకర్తరకంఎల్లాంటిదైతేనేమి, తెలుగులో గ్రంథకర్తకి డబ్బు గాని, రాజాశ్రయంగాని ఉంటే గ్రంథం శీఘ్రంగా అచ్చులో పడుతుంది. వీరేశలింగం వరకూ అన్నమాటేమిటి, నేటివరకూ రాజాశ్రయమే పద్యగ్రంథ కర్తని విరివిగా పోషించి, నిత్యమూ రక్షించి నిలబెడుతోంది. గ్రంథకర్తే క్రమేపీ జనానికి ప్రతులు అమ్ముకుని డబ్బు చేసుకుంటాడు. ఒకవేళ, ప్రతులు జనానికి నయించక వాళ్ళవి కొనరని తోస్తే, జనానికి ఉచితంగా పంచిపెడతాడు; లేకపోతే పుస్తక భాండాగారాలకో, పోటీ పరీక్షలకో, గొప్ప వ్యక్తులకో బహుమతీలుగా ఇచ్చేస్తాడు; ఏదో ఇదవుతాడు. ముందు అనుకుంటేం అనుకోకపోతేం, పదపడి జనాన్ని రంజించిన గ్రంథం యొక్క ప్రతులు ఎల్లానో అల్లా పుడుతూనే ఉంటాయి. గయోపాఖ్యానమూ, కాశీమజిలీలూ, భక్తచింతామణీ, వీరేశలింగ వచన కృతులూ వంటి జనప్రియగ్రంథాలు తెలుగువి ఉన్నాయి, విశేషధనం ఇచ్చి ఇంకా ఇస్తూనూఉన్నాయి. మరి డబ్బులేని గ్రంథకర్త (సాధారణంగా ఉండదుగదా! అందులో poetry కీ poverty కీ చాలా దగ్గిరన్నాడు ఓకవి, V అంటే

విక్టరీ, విజయం! కనక షాయెట్రీకి విజయంసంక్రమిస్తే పావర్టీయే గావును!) డబ్బిస్తారని ఎవరికేనా అంకితం చెయ్యడమో, ఎవర్నేనాయాచించడమో, ఏవరిచేతేనాచందా వెయించడమో జరగాలి. లేకపోతే, బదులు తెచ్చి అడ్వాన్సులు పారేసి అచ్చు సాగించి రెక్కలొచ్చిన గ్రంథ ప్రతుల్ని ముద్రాలయంలో వదిలెయ్యడం! ఆదిక్కూ లేకపోతే, అదుగో అప్పుడు - ప్రచురణకర్త జనప్రియగ్రంథానికోసం వెతకడం పోయి, గ్రంథకర్త బయల్దేరి మీరా మీరా అని ప్రచురణ చెయ్యగలవాణ్ని వెతుక్కోడం!

ఆంధ్ర గ్రంథ ప్రచురణ ౧౮౦౫ నించీ జరుగుతూనే ఉందనీ ౧౮౭౦ నాటికే తెలుగులిపిలో గ్రంథప్రతులు అచ్చుపడ్డాయనీ తెలుస్తుంది. ప్రాచీనాంధ్ర గ్రంథ ముద్రణంతో ఆంధ్రజనం యొక్క కళ్లు ౧౮౫౪ నించీ తెరిచిన శ్రీవావిళ్ళవారి గ్రంథ సేవగురించి ఎరగని ఆంధ్రు డుండడు! ౧౯౦౬ తరవాత విజ్ఞాన చంద్రికామండలి జనించి, ఎంతకాలం పాటు అయితేం నామ సార్థకం చేసుగుంది. ఆసంస్థ తెలుగుప్రజయొక్క శాస్త్రజ్ఞాన ప్రమాణం ఎక్కువచెయ్యాలనే సదుద్దేశంతో కీ. శే. కొమ్రరాజు లక్ష్మణరావుపంతులు చేసిన ఏర్పాటు. కాని, ఆయనతో పాటు అదీ తగ్గింది. ఒక తెలుగుసంస్థని సవ్యంగా నడిపే ఒక తెలుగువ్యక్తి తప్పుగోడంతోటే ఆసంస్థ చెల్లాచెదరైపోవడం ౧౯౨౩ నించి ఇప్పటి వరకూ నిజమే! అల్లాచెదిరిపోకుండా నిల్చినవి తెలుగులో లేవని చెప్పలేంగాని, ఉన్నవాటిని వెతికి

పోల్చుగోవాలి, లెక్కపెట్టడానికి వేళ్ళు చాలు! పదపడి ఆంధ్ర ప్రచారిణీ, ఆంధ్రభాషాభివర్ధనీ, వేగుచుక్క మొదలైన కొన్ని గ్రంథమాలలు నవలాప్రచురణ విస్తారం చేస్తూ ఆంధ్రుల్ని ఆకర్షించాయి. గ్రంథకర్తల్ని ఎంతగట్టున పడేశాయో తెలియదు. క్రమశః ఆంధ్రగ్రంథమాల, సరస్వతీ గ్రంథమండలి మొదలైనవికూడా వెలిశాయి; కష్టనష్టాలకీ ఓరుస్తూ నేటికీ ఉన్నాయి. తరవాత ప్రచురణసంఘాలు పుడుతూనే ఉన్నాయి. కొన్ని సంఘాలకి పేరు సంఘం; సభ్యుడు ఒకడే! తెలుగులోనూ బహుశా సర్వత్రాకూడా, సంఘాలన్నీ క్రియకొచ్చేసరికి అంతే అనచ్చు. ఆ ఒక్కడే "అండ్ కో", లేకపోతే "అండ్ సన్స్." ప్రచురణసంఘాలు రెండురకాలు – పఠనగ్రంథాలు ప్రచురించేవీ, పఠనేతరగ్రంథాలు ప్రచురించేవీనూ. మొదటిరకం సంఘాలకి అసాధారణపు ప్రతినిధులు. ఆ సంఘాలకి (కొండొకచో ప్రతినిధులకి) తెలుగు రాకపోయినా వాళ్లు ధనాధికారపరిచయ వ్యాపారప్రభావాలు కలవాళ్ళవడంచేత తెలుగుపఠనగ్రంథాలు తమ ఇచ్ఛప్రకారం పెట్టించడం చిరకాలంనించీఎరుగుదుం. కొన్ని పఠనగ్రంథాల్లోని తెలుగు, ఇంగ్లీషు చదివినవాళ్ళు హిందీ మాటెట్టుగుని అరవాన్ని ఆలోచించి తెలుగులో వెలిబుచ్చిన పాకంలో పడడంచేత బహువ్యాకరణయుక్తంగా ఉండడమేకాక తెలుగుబాలబాలికలు శాస్త్రజ్ఞానాభివృద్ధి చేసుగోడానికి మిక్కిలి తగిఉన్నట్టుగూడా కనిపెట్టబడి, ఆమోదించబడి, దించబడతాయి. ఆంధ్రగ్రంథనిర్ణాయకసంఘంలో గొప్ప ఆంధ్రులు

ఉంటారు. మనలో మనమాట, గొప్ప ఆంధ్రుడంటే, పొలం, ఆస్తి, రొఖ్ఖం, చలాయింపూ, ఆఖరికి గౌరవాధికారమూ, అవేవీ కాకపోతే ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ, అరవం, కన్నడం బెంగాలీలాంటి (తెలుగుతప్ప మరి ఏదైనాసరే) ఒక భాష తన స్వాధీనంలో ఉన్నవాడు - అన్నమాట. అటువంటి సంఘాల్లో గౌరవసభ్యత్వానికి జిల్లాబోర్డులవంటి గొప్ప సంస్థలుకుడా పడే ఆందోళన ఇంతా అంతా కాదు. ఆ గౌరవసభ్యుల మాటతో గొంగళీపురుగుల్లాంటి చీదరగ్రంథాలు పఠనగ్రంథాలనే సీతాకోకచిలకల్లాగ మారి, ఎగిరిపోతాయి! ఈసంగతి కూడా ఆ అఖండుడు గురజాడ అప్పారావు సూచించాడు: "క్రైస్తవమతనిబంధనల్లో పదకొండో భగవదాజ్ఞ - 'నువ్వు చదివితీరాలి' అనేది లేదు! అయినాసరే ఒకొక్క గ్రంథనిర్ణాయక సంఘంలో ఉండే మహాపూజ్యులు - 'ఈగ్రంథంచదివి తీరాలి' అని ఆజ్ఞాపించేసరికి, కర్మంకాలిన వేలాదివిద్యార్థులు మానవమాత్రుడికి లాభంగాని, ఆనందంగాని లేశమూ కలగని గ్రంథాలు చదివి పారెయ్యాలి" అని. కాని, సర్వేసర్వత్రా ఇది నిజం కాకపోవచ్చు. ఏమంటే, ప్రమాదంచేత ఎప్పుడేనా ఒక సార్థక గ్రంథంకూడా పఠనగ్రంథంగానూ పడచ్చు. ఇక, ప్రచురణసంఘాలవాళ్ళు పోటాపోటీలు పడి, తమరి గ్రంథాలే పెట్టించుకోవాలని నిర్ణయాకసభ్యుల్ని విడివిడిగా దర్శించి, వాళ్ళకి వద్దు మొర్రో అంటూంటే వందలూ వేలూసొమ్ము గిరవటేస్తూ, ఋషితుల్యులులాంటి ఆ సభ్యుల్ని, విద్యా

విషయంలో తప్ప కడమ అన్నింటిలోనూ వేరుమోగిన కొందరు అఖండుల్ని, చెడగొట్టడానికి యత్నిస్తారు. ఆ సభ్యులూ అధ్యక్షుడూకూడా వాళ్ళు, ఒకరికి తెలియకుండా ఒకరు, గుమ్మరించ దల్చుగున్న పాపపుసొమ్ముగురించి భీతిల్లిపోయి, తమరాసొమ్ముకేసేనా చూడక, తమకి దగ్గిరబంధువుని ఎవణ్ణేనా మధ్య అడ్డుంచి, ఆపాపిష్టిసొమ్ము మరోదిక్కుకిపోయి ఇంకా పాడుపన్లు చేస్తూకూర్చోకుండా దాన్ని జాగ్రత్తచెయించేసి, దాంతోటి గౌరవవిందులూ, పైవారి ఖర్చులూ, కిందివారికి చందాలూ, ఇంట్లో నగలూ ఊళ్ళోఎన్నికలూ — లాంటి పవిత్రపుపన్లకే దాన్ని వాడేస్తారు. పఠనగ్రంథనిర్ణయంలో ఒక్కొక్కప్పుడు గ్రంథం చాలామట్టుకి వెడుతుంది. పూర్వం ఒక పరీక్షకి రెండు సూక్ష్మపఠనగ్రంథాలూ, నాలుగు స్థూలపఠన గ్రంథాలూ - ఒకపరీక్షావిషయం గురించి - ఉండేవి. ఆ నాలుగు స్థూలపఠనగ్రంథాలూ ఏయేటికాయేడు పెట్టించుగునే నిమిత్తం ప్రచురణసంఘాలు విరజిమ్మదల్చిన సొమ్ముయొక్క పరిమాణం చూసి అధికారులు హడిలి ఆకాశం అంటి విచారణచేసిచేసి, దారి కనిపించక, ఆపరీక్షకి ఆసంవత్సరం నించి, స్థూలపఠనగ్రంథాలు అఖ్ఖర్లేదు, అసలే తీసేశాం పొమ్మన్నారు! మహానగరాల్లో ఉండే ఇటువంటి సంఘాలు గ్రంథకర్తయొక్క హక్కులూ పుచ్చుగున్నా పారితోషికం విషయంలో ఏదో ఒక నియమప్రకారమే పోతూంటాయిగాని గ్రంథకర్తతో అనుబంధం వీలైనంత శీఘ్రంగా తెంపేసు

గుంటాయి. దేశం తెలుగుమీరింతరువాత గ్రంథవ్యాపారంలో లాభాలు చూస్తూ చూస్తూ పోగొట్టుకోలేక ప్రచురణ సంఘాలూ, ప్రచురణకర్తలూకూడా ఊరూరా వెలవడం సాగింది. పైచెప్పిన నిర్ణాయకసంఘాలలోని సభ్యుల్ని అండగా చూసుగుని, ఏ వ్యక్తి అయినాసరే, బుద్ధి ప్రజ్ఞగాని, సొమ్ము పెట్టుబడిగాని అక్కర్లేకుండానే పఠనగ్రంథప్రతులు ముద్రింపించ గలిగి లాభం తియ్యగలడు, అని తేలింది. అటువంటి వ్యక్తులకి ఏదో గోకిపెట్టడానికి వాళ్ళచుట్టూ ప్రదక్షిణాలు చేసే గ్రంథకర్తగ్రహాలకి ముట్టే దక్షిణగురించి ఊహించుగోడమే నయ మనిపిస్తుంది.

విక్రేతాశ్రమంలోంచి లేచిన ప్రచురణకర్తలు పఠనేతర గ్రంథాలు అచ్చువెయ్యడం కద్దు. తెలుగు పామరజనంయొక్క ప్రస్తుత పఠనాభిరుచి ఏమిటంటే, వీలుగా ఉంటే శృంగారం, స్మృతిమించితే వైరాగ్యం - అంతేగాని మధ్యరంగాలు ఉన్నట్టు తోచదు. అందుకని, శృంగార వైరాగ్య గ్రంథాలకీ, భక్తి వేదాంత గ్రంథాలకీ మాత్రమే విస్తారం చలామణీ. తెలుగులో 'భక్తి' అనేది ఒక రసం అనే సంగతి రసవాదులంతా నేర్చుకోవలసిన విషయం. 'భక్తి' అనే వర్తకవ్యాపారంలో దగాపడి నష్టపోయే ఆంధ్రుల్లో ఉన్నంతమంది ఎక్కడా ఉండరు. ఇవికాక ఇంకా పుడుతూండే గ్రంథాలు నవలలు. నవలాజననం ఎవడూ తప్పించలేడు. వందలాది ఏళ్ళనించీకుడా విదేశాల్లోకూడా అధికజనాకర్షణ చేస్తూన్న గ్రంథాలు

నవలలే. నవల ఎవడేనా సరే రాయడానికిన్నీ, నవలావస్తువు ఉన్నదీ లేనిదీ, స్వాంతమూ ఇతరమూ, ఇహమూ పరమూ, గమ్యమూ అగమ్యమూ, ఊహ్యమూ సిద్ధమూ ఏదేనా సరే అయిఉండడానికిన్నీ, నవలాశరీరం వర్ణనా, మననమూ, కథనమూ, సంభాషణా ఏదేనాసరే అయిఉండడానికిన్నీ, నవలాపాఠకుడు ఎవరేనాసరే అయిఉండడానికిన్నీ, సావకాశా లుండడంచేత నవలాసృష్టికీ, వ్యాప్తికీ ఉన్నన్ని మార్గాలు ఏయితరగ్రంథవిశేషానికీ ఉండవ్. కాని ప్రతీ 'చెత్త' నవలా సారస్వతంలో నిలుస్తుందా అంటే ఏదేనా సారస్వతంలో నిలవడం అన్నింటికి మల్లేనే, దైవాధీనం - అనగా ముందే తేల్చడానికి వీల్లేనిది. అల్లాబయల్దేరిన నవలల్లోనూ, చిల్లరి గ్రంథాల్లోనూ ఎక్కువసంఖ్య జ్ఞానదృష్టికిగాని, సారస్వత దృష్టికిగాని, కళాదృష్టికి గాని అందకపోయినా అడ్డమైన పామరుణ్ణీ క్షణంలో జ్ఞానిగా సారస్వతుణ్ణిగా, కళానిధిగా మార్చి వాడికి సూక్ష్మంలో మోక్షం ఇప్పించగల దురాశలు నమ్మకంగా కలిగించగల చాతుర్యం కలవి.

కొన్నిగ్రంథాలు ప్రతీ 'భూతం' మంచిదీ-ప్రతీవర్తమానమూ చెడ్డదీ అనే ఊకదంపు పాతపాట పాడి మూర్ఖజనాన్ని శ్రమలేకుండా నచ్చగొట్టగల బాపతువి. మరికొన్ని స్త్రీ పురుషానుబంధమూ, అందులో అపసవ్యప్రేమా మాత్రం కెరటం వేస్తూండి, అన్యస్త్రీపురుషుల అపవిత్ర సాంగత్యం ఎదైనాసరే పఠించుకోడమే జన్మతారకమని కులికే ఆంధ్రమహాజనుల్ని

తెప్పల తేలగొట్టే రకం. ఈరకపు పామర గ్రంథాలయొక్క ప్రతి ఒకటికి కానీ లగాయతు పావలాలోపు ఖరీదు పడేటట్టు ఖర్చులు ఖంజాయించుకోగల ప్రతీవిక్రేత చేతుల్లోనూ పామర గ్రంథపరంపర చిక్కిపోయింది. అటువంటి వ్యాపారంలో విజయం పొందడానికి పుస్తక విక్రేతకి కావలసిన ఆదిసామగ్రి ఒక కకూర్తి గ్రంథకర్త! ప్రపంచంలో కకూర్తికీ లోటులేదు, గ్రంథకర్తలకీ లోటులేదు. గ్రంథమూల్యం తెలియక హక్కులన్నీ తెగనమ్మి, లక్షలాది పాఠకుల్ని కలిగిఉండీకూడా తమరు కకూర్తిగానేఉన్న గ్రంథకర్తలు తెలుగులోఉన్నారు. ప్రచురణకర్తల దగ్గిర సొమ్ము ముందు తినేసి, శూన్యం రాసిచ్చిన గ్రంథకర్తలూ ఉన్నారు. ప్రచురణకర్తకి విజ్ఞానం ఉండటం లేదని గ్రంథకర్తగారి ఆక్షేపణ: గ్రంథకర్తకి జ్ఞానం మాట అదేపోయె, ఇంగితజ్ఞానమూ వ్యవహారజ్ఞానమూకూడా సాధారణంగా ఉండవుగదా అని ప్రచురణకర్త ధైర్యం! తెలుగు జనం ఇదంతా చూస్తూ, రోజులమహిమ అనుకుంటూ తమరే తిడుతూనే ఆ గ్రంథాలే కొనుక్కుంటూ ఉండడమే కాని, తమరు వెచ్చించిన డబ్బు యథార్థంగా పంపకం అయిందో లేదో కనుక్కోడంలేదు. "ఇటువంటి గ్రంథకర్తలూ, గ్రంథాలూ, విక్రేతలూ, పాఠకులూ ఎంతమాత్రం ఉండకూడదు" అని పండితులు జోరుగాశాసించి జారుగా ఊరుకుంటారు. గొప్ప వాడైన ఆంధ్రుడు ఇదీ లేదు అదీ లేదు ఎదీ చూడడు. ఇక, తనకి నల్లమందైన పత్రికే కొనకుండా చదివేసుగోడం గడుసు

దనం అని సంతోషించుకునే జనం గల ఆంధ్రంలో, గ్రంథాలు కొనాలి అనుకునే భావం సర్వత్రా ఉంటుందా! పెద్దగ్రంథం — అబ్బో, కొనలేరు. సామాన్యగ్రంథం — ఎందుకూ కొనడం, ఓమాటుచ్చుగుని చదివి ఇచ్చెయ్యొచ్చు. అంతగా అయితే, తమరు ధనవంతులైనాసరే, గ్రంథాలయానికి వెడతారు. ఏదేనా గ్రంథాలయానికి వ్యక్తిత్వం ఉండాలీ అంటే అక్కడ ఫలానా శాస్త్ర గ్రంథాలుమాత్రమే ఉండడమూ, లేక ఫలానాకళ గురించిన గ్రంథాలుమాత్రమే దొరకడమూ, ఫలానాచరిత్ర, ఫలానాసారస్వతం మాత్రమే తెలుసుగోడానికి వీలుండడమూ, ఫలానాఖరీదుకంటే ఎక్కువగా ఖరీదుగల గ్రంథాలుమాత్రమే ఉండడమూ — ఇల్లా ఏదో విశేషం ఉండాలి. ఉంటే, అటువంటి గ్రంథపరంపర సంప్రతించేనిమిత్తం ఎవరేనా గ్రంథాలయానికి వెళ్ళడం సమంజసం. అంతేకాని, ఊళ్ళో మిక్కిలి చౌకగా దొరికే గ్రంథాలే చాలా చేతులు మారి గ్రంథాలయాల్లో ఉండడమూ, అటువంటివికూడా స్వంతానికి కొనుక్కోక ఉచితంగా చదువుకోడానికి ధనం ఉన్నవాళ్ళు కూడా అక్కడికి తయారవడమూ జరుగుతూన్నంతకాలం గ్రంథప్రచురణ ఇల్లానే ఉంటుంది. పోనీ, ప్రతీగ్రంథాలయమూ తను సేకరించదల్చుగున్న రకంలో గ్రంథాలు కొనిపిస్తుందా! ఏమో! "ఉచితంగా గ్రంథాలు సమర్పిస్తే శ్రమపడి ఎల్లాగో పుచ్చుగుంటాంగాని ఈ దిక్కుమాలిపుస్తకాలన్నీ గ్రంథాల్టండీ, కొని డబ్బుతగలెయ్యడానికీ!" అని ఒక గ్రంథాలయాభిమాని

అన్నాడు. ప్రజ్ఞ యొక్క విలవ శూన్యం అనుకున్నా, కాగితానికీ అచ్చుకీ కొంత ఖర్చు అవుతుందేమో అనే సందేహంకూడా లేని ఆంధ్రభాషాభిమాను లున్నారు. తన రచన ఎల్లాగైనాసరే అచ్చులో పడితే చాలు అది ఇహాశాశ్వత బ్రహ్మకల్పంగా నిల్చిపోతుందని భ్రమించే రచయితా, అచ్చులో వచ్చిన ప్రతీవాక్యమూ పరమసత్యం అనుకుని లెంపలేసుగునే పాఠకుడూ తెలుగులో నేడూ ఉన్నారు.

వీళ్లేకాక, మనలో గ్రంథప్రచురణావిషయం ఇప్పుడున్న రీతిని ఉండడానికి ఇంకా ఎందరో వాటాదా ర్లున్నారు. ఒకొక్కప్పుడు గ్రంథభర్త ఉంటాడు — డబ్బోసి గ్రంథపు పిల్లని కొనుక్కున్నవాడు! గ్రంథసంపాదకుడు — అదీ ఇదీ ఏరు కొచ్చి గ్రంథాన్ని పోగుచేసి పెట్టేవాడు! గ్రంథపరిష్కర్త — చాలాసందర్భాల్లో తనకి తెలియనివన్నీ తప్పు లనుకుని దిద్ది పారేసి దొరక్కుండా ఉండేవాడు! గ్రంథముద్రాపకుడు — గ్రంథాన్ని లిపిలో కొట్టేవాడు! గ్రంథబంధి — దిట్టంగా గ్రంథాన్ని కుట్టేవాడు! గ్రంథక్రాయకుడు — గ్రంథాన్ని కొనుక్కునేవాడు! గ్రంథసారచోరుడు — అన్యగ్రంథాల్లో ఉండే రచనాక్రమాన్ని తస్కరించి ఆ శ్రమా, ప్రజ్ఞా తనవే అని జనం అనుకోవా లని అపహరించేవాడు! గ్రంథఋణదాత — గ్రంథం అరువిచ్చి వెనక్కి రాకపోతే సణుక్కునేవాడు! గ్రంథ ఋణస్థుడు — గ్రంథంఅరువు తెచ్చుగుని మరి వెనక్కి ఇవ్వని వాడు: ఎంచేతంటే, గ్రంథం అరువు తేవడమే బుద్ధితక్కువగదా

మళ్ళీ అల్లానే తీసిగల్లి ఇచ్చేయ్యడం అంతకంటె బుద్ధితక్కువ అయిపోతుందేమో అనే భయంచొప్పున ! గ్రంథపోషకుడు ! గ్రంథయాచకుడు ! గ్రంథపాఠకుడు ! గ్రంథలేఖకుడు ! గ్రంథోన్మత్తుడు-గ్రంథాలంటే వెర్రెత్తిపోయినవాడు! గ్రంథోపాసకుడు! గ్రంథలుబ్ధుడు - గ్రంథాలుకొని, చదవక, ఉన్నట్టైనా ఎవరికీ తెలియనివ్వనివాడు ! గ్రంథభుక్కు - చెదపురుగు : దీన్ని వీలు చేసుగుని బుక్కు-భుక్కు అనాలి ! గ్రంథపు బరగూ - రామబాణపు పురుగు ! గ్రంథవిద్వేషి ! గ్రంథవిధ్వంసి - చదివినగ్రంథం యొక్క ప్రతీపుటా చింపి అవతల పారేసేవాడు ! గ్రంథారి - గ్రంథం చూస్తూ తగలేసేవాడు ! గ్రంథచికిత్సకుడు - గ్రంథాన్ని కోసి బాగుచేసేవాడు ! గ్రంథవైద్యుడు — గ్రంథానికి రోగం రొచ్చూ వస్తే ఆదరించేవాడు !! ఇల్లాగా గ్రంథం చాలా ఉంది.

గొప్ప తెలుగుగ్రంథానికి మూల్యం ఎంత ! వెనకటి పెద్ద గ్రంథకర్తలకి ఏమి విలవ ముట్టిఉంటుంది? అంటే, కోరింది యావత్తూ ముట్టిఉంటుంది. మహారాజపోషణలో ఉంటే, మూలగ్రంథానికే విలవ వచ్చేస్తుంది. గ్రంథ ప్రతులెందుకూ, కర్తకీ ! అది విలవ గలది అని తేలింతరవాత, కావలసినవాడు గ్రంథానికి ప్రతి రాసుగుని ఉండేవాడు. రాసినవాడికి రాసినన్నాళ్ళూ భోజనం పెట్టి సుబ్బరమైన ధోవతులచాపు ఇచ్చేవారని తెలుస్తుంది. పాఠకుడు చదివితే చాలామంది శ్రోతలు ఆలకించేవాళ్ళు, తీరిపోయేది. గ్రంథాని

కన్నమాటేమిటి, రసజ్ఞుడైన ప్రభు వున్నప్పుడు, గ్రంథభాగానికీ, పద్యానికీ, పాదానికీ, మాటకీ, అక్షరానికీకూడా విలవగట్టి ఉండే వాళ్లనిగదా వింటాం! అయితే, నేను, దృక్పథాలూ, విలవలూ మారుతూండేటప్పుడు, సంఘంమీదే వ్యక్తి ఆధారపడవలసి తీరుతుంది. గ్రంథప్రతులఅవసరం ఉంటుంది. అచ్చు తప్పదు. (కాకితం దొరికితేమాటే!). అయినాసరే, సంఘతత్వం, సంఘాభిరుచీ, సంఘసంఖ్యా తెలియందీ గ్రంథకర్త తన గ్రంథంయొక్క ప్రతులు తయారు చెయించకూడదు. ఆ వయినాలు తెలుసుగోకుండా గ్రంథకర్త ప్రతులు తయారు చెయించాడా (ప్రచురణకర్త ఇంగితజ్ఞానం లేకుండా ఉండడుగనక తన పూచీమీద ఎన్నడూ అట్లాంటి పనిచెయ్యడు!) భోజనానికి వచ్చేవాళ్లు ఎవరో, ఏం తింటారో, ఎంతమందో తెలుసుగోకుండా వంట తయారుచెయించినట్లవుతుంది. ఇతర దేశాల్లో (బహుశా ఇతర రాష్ట్రాల్లో) గ్రంథంయొక్క విలవ గుర్తించు గున్నారు. 'సర్వస్వామ్య సంకలితం' అని అట్టమీద అచ్చేసి, ఒక్కొక్క గ్రంథకర్త, అవేమిటో కనుక్కోకుండా తనకి కాఫీ ధారపోసిన వాడికి తనగ్రంథాన్ని ధారపోస్తే ఏమైనట్టూ! ఆ స్వామ్యాల్లో ప్రతుల ముద్రణం, భాషాంతరీకరణం, సూక్ష్మీకరణం, విపులీకరణం, నాటకీకరణం, తెరమీదికీ గ్రామఫోనుకీ రేడియోకీ ఇయ్యడం, చౌకప్రతులముద్రణంవెయ్యడం, భాగాల్లోవెయ్యడం, అన్యరాష్ట్ర దేశ ఖండాల్లో పై ప్రకారం చెయ్యడం - గురించిన హక్కులువన్ని ఉన్నాయో గ్రంథకర్తలకికూడా తిన్నగా తెలియ

దనిన్నీ, అందువల్ల ఇతరదేశాల్లో సుప్రసిద్ధుడైన ప్రతిగ్రంథకర్తకీ ఒక ఏజంటు ఉండి ఈహక్కులద్వారా ఒక్కొక్క గ్రంథంమీద కర్తకి పారితోషికవార్షికాలు ఎంతెంత రావలసిఉంటాయో కట్టి వసూలుచేస్తూంటా డనిన్నీ తెలుస్తుంది. ఆంధ్రంలో గ్రంథకర్తలు తమలో హెచ్చుతగ్గులు కట్టుగోడాలూ, కాట్లాటలూ, ఈర్ష్యలూ, మానుకుని, తమకు ఉంటూాండే స్వామ్యాలు గుర్తించుగుని అవి కాపాడుకునేటందుకు సంఘాలుగా ఏర్పడి వాటిద్వారా పనులు సాధించుగోడం ఎప్పుడోగదా! ఇతరదేశాల్లో గ్రంథాలు కొనేవాళ్ల సంఖ్య చాలా హెచ్చుగనక, చౌకరకపు గ్రంథాలప్రతులు లక్షగాని పదిలక్షలుగాని ఒకేముద్రణంలో పడడంవల్ల గ్రంథప్రతి ఒకటికి చేతఖర్చు చాలా తక్కువగా ప్రచురణకర్తకి కిట్టడంవల్ల విక్రేత కూడా చాలాచౌకగా దేశదేశాలాకూడా వాటిని అమ్మగలుగుతాడు. ఆంధ్రంలో ప్రతీనాయకుడూ తనకి అవసరం లేకపోయినా సరే తనభాషగదా అనే జాలితో తనఅభిరుచినిబట్టి ఏవో కొన్ని తెలుగు గ్రంథాలు కొంటూాన్నప్పుడుగాని తెలుగు ప్రచురణ సంస్థలు విరివిగాపనిచెయ్యవు. సందేహాస్పదంగా ఉండే గ్రంథాల ప్రచురణగురించి సాహసించనక్కర్లేదు, పోనీ, రూఢిగా జనప్రియత్వం ఆర్జించిన గ్రంథాల విషయంలోనేనా, న్యాయమైన నియమాలతో నిజాయితీగా వ్యవహరించగలపేరు తెచ్చుగోవాలనే ఆశయంతో ఇప్పటికంటె ఎక్కువగా ప్రచురణ సంఘాలున్నప్పుడుగాని తమ గ్రంథప్రచురణగురించి నిర్భయత్వం

వహించి నిశ్చింతగా రచననే ఉపాసించగల గ్రంథకర్తలు దొరకరు. భాషాభిమానం గల ప్రచురణకర్త తనకి నచ్చిన గ్రంథకర్తని వరి ఎన్నుకున్నప్పుడుతప్ప, విక్రేతే గ్రంథ వ్యాపారం నిమిత్తం ప్రచురణకర్తగా మారి, ఆశ్రయించిన వాణ్ణల్లా గ్రంథకర్తగా అడ్డెట్టుగుని వ్యవహరించడానికి వీలు ఉన్నన్నాళ్ళు దేశజ్ఞానం పై కేసివెళ్ళదు. విదేశాలలో ప్రచురణ చేసేవారు మాకు ఫలానా ఫలానారకాలు, ఫలానాకళ, ఫలానాశాస్త్రం, లేక సముద్రయానం, దేశాటనం, సాహస విహారం, పరిశోధకనవల, పద్యం, నాటకం, రాజకీయం, మన స్తత్వం — ఇవి ఇవి కావాలి, ఈయీ శాఖల్లో, ఈయీ రూపాల్లో, ఈయీ సంప్రదాయాలతో, అని కోరి నచ్చిన వాళ్లని ఎన్నుకుంటూ, వాళ్లకి, అనేక సహస్రవందనాల్తో సానుభూతికూడా కలిపియిచ్చి మాడ్చక, విరివిగా పారితోషికం యిస్తూ, వాళ్లతో మొత్తంమీద మిక్కిలి అన్యోన్యంగా ఉంటూ పారంపర్యంగాకూడా ఆమైత్రి అల్లానే ఉంచుగుం టున్నారని తెలుస్తుంది. జనసేవనిమిత్తం స్థాపింపబడి పని చేస్తూన్న తెలుగుసమాజాలు ప్రచురణసంఘశాఖలు పెట్టి గ్రంథకర్తల్ని పోషించి ఒకవేళ లాభం పొందగలిగితే ఆలాభం ఏకవ్యక్తియొక్క లాభానికిమల్లేకాక, మళ్ళీ జనానికే ఉపయోగింపబడుతుంది కదా! అటువంటి సమాజాలతరపున ప్రచురణసంఘాలు పుట్టడం ఎప్పుడో గదా!

గ్రంథం అంటేనే సవాలక్షగ్రంథం! "గ్రంథంఅనేది బెత్తం

పుచ్చుకోకుండా మనికి బోధించే గురువు. మనం గ్రంథాన్ని ఎప్పుడు సమీపించినాసరే దానికి నిద్దరబద్ధకమూ, మరుపూ ఉండవు. మనం గ్రంథాన్ని ఎప్పుడు అడిగినాసరే, ఇప్పుడు కాదు అనడంగాని, ఏదో సాకుచెప్పి దాటెయ్యడంగాని దానికి తెలియదు. మనం తప్పులుచేసినాసరే గ్రంథం మనల్ని మందలించదు. మన అజ్ఞానం ఎంత దట్టమైనాసరే గ్రంథం మనల్ని హేళనచెయ్యదు'' అని ఒకమహామహుడు గ్రంథాన్ని ప్రస్తుతించాడు. గ్రంథం ఒకఆత్మయొక్క అక్షరరూపం ! దాన్ని సదుద్దేశంతో ఒక్క అన్యహృదయానికి చేర్చగలగడం ప్రచురణ ! జనాన్ని ఆకర్షించి జనానికి ఎందుకో అందుకు ఉపయోగపడుతూండే గ్రంథంగాని సజీవగ్రంథంకాదు. ఆకర్షణ లేని గ్రంథం జనహృదయానికి ఎక్కదు. ఉపయోగ పడు తూండని గ్రంథం జనహృదయాలకి ఎక్కినా నిలవదు. జనహృద యాల్లోకి ఎక్కి నిల్చినప్పుడుమాత్రమే గ్రంథానికి సార్థక ప్రచురణ ! ఇంతటితో, “ గ్రంథవిస్తరభీతిచేత ” ఆగు తున్నాను. సెలవ్.

సంపూర్ణం